# నవ్య సాహిత్య మాల

సంపాదకులు :

విద్వాన్ విశ్వం.

టి. నాగిరెడ్డి.

ఈ రచయిత్రివే:

విరికన్నె

ఫాసిజం

లెనిన్

ఏమిచెయ్యడం?

పాపం

# మనవి

మా 'నవ్యసాహిత్యమాలకు' రెండేండ్లు నిండి మూడోయేడు పడింది, ఇంతవఱకూ సాయంచేసిన వారందరికీ కృతజ్ఞులము. ఇట్లాగే యీమాత్రం సహకారం చూపినా పదికాలాలపాటు గ్రంథమాలను నడపగలమనే విశ్వాసం మాకుంది.

ఇదొక వ్యాససంపుటి. అప్పుడప్పుడూ శ్రీ సాధనలో వ్రాస్తూన్నవానిలో కొన్ని యీరూపం తాల్చినవి. దేనికది ప్రత్యేకంగా కనబడుతున్నా అన్నిటినీ అనుసంధించే ఒక సమీక్ష వీనిలో ఉందనుకుంటాను. చదివితే మీకే తెలుస్తుందిలే.

జనవరి 15, 1940.
అనంతపురం

విశ్వం.

# వింటారూ?

విచిత్రంగా ఉంటుందీ విశ్వం సంగతి. వివిధరూపాలతో విలసిల్లుతూన్న దీని తత్త్వాన్ని తెలుసుకోవడానికే వేనకువేల తత్త్వశాస్త్రాలు వెలువడినవి; వెలువడుతున్నవి. అందుకోసమే మహాత్ములెందరో తమ మనశ్శక్తినీ ఆత్మశక్తినీ వెచ్చించి పరిశీలనలను చేస్తున్నారు.

ఏమి టీప్రపంచం? దీనికీ మనజీవితానికీ గల సంబంధం యేమిటి! ఇవో పెద్ద కొశ్చను మార్కులు. వీనికి ఒకొకరికి ఒకవిధమైనరీతిగా సమాధానాలు దొరుకుతూంటవి ఒకరంతా ఆనందమయం, ఇందులో ఆనందానుభవమే మనకు కర్తవ్యం, అంటారు. మరొకరు అంతా దుఃఖమయం, ఏమీ యిందులో అనుభవించడానికి తగినదిలేదు; ఈ దుఃఖమయ ప్రపంచాన్ని తద్వ్యవ యాలనూ ఆలోచించక తదతీతవస్తువును భావించమంటారు. అదికాదు అసలు సంగతి. ప్రపంచమంటే మాయ. తాను అనే పదార్థం తప్ప మరేదీలేదు అంటాడు మరొకాయన. ఇన్నిటికీ

సామరస్యం కలిగించాలంటాడు మరొక మహాత్ముడు.

'లోకమెట్లా ఉందిరా సిద్దా' అంటే 'ఎవరి లోకం వారిది నాన్నా' అన్నాడట. హాయిగా అన్ని వసతులూ ఉండి కులాసాగా పన్నీట జలక మాడి పట్టుపుట్టాలతో పరిమళం పరిభ్రమించే పూదోటల్లో పుష్పాడి మెత్తలపై మేను వాల్చే షావుకారికూతురి లోకానికీ; పొద్దున్నే లేచి సద్ది బువ్వైనా లేక తల్లికి సాయంగా గింజలు దంచి కలో అంబలో తాగి కడి బుజాన వేసుకొని చేలో వంచివనడుము యెత్తకుండా పనిచేసే కూలోడి కూతురి లోకానికీ, మింటికీమంటికీ ఉన్నంత తేడా లేదూమరి ? అందుకే పరిసర పరిస్థితులే మానసిక భావాలకు కారణమనవచ్చును. ఆయా పరిస్థితు లలోనున్న వాని భావన ఆయారీతులలో జరుగుతూం టుంది. ఒకేవ్యక్తభావనలు పరిస్థితుల మార్పుల వల్ల కూడా మారుతూంటవి. అంతా ఇదంతా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో, తమతమ ఆర్థిక పరిస్థితులతో కూడా సంబంధం కలిగిఉన్న దనక తప్పదు. మన తలపులన్నీ యేదో అవ్యక్తమైన భావప్రపంచములోనుంచీ అలా ఉద్భవిస్తూన్నా యనడంమాత్రము వల్లకాదు. ఈ అభిప్రాయా

లన్నిటికీ వారిఆర్థికాదులైన భౌతికవాతావరణమే కారణం.

నా సంగతే చూడండి. అన్ని వసతులూ ఉండీ, సావాసగాళ్ళతో సంబరపడుతూ, 'మోహన ముగ్ధతో పసంజసన పటిష్ఠయూ ప్రకృతి' లో 'ఆనందైక రసమూర్తి అంచుపఅ కేఅడ్డంకియూ లేక యెంతేనందంబుగనున్న మానసము'తో ఆలోచిస్తూంటే తోచేసమస్య:

'అరవిరి తేనెసోన కడుపారగగ్రోలి యమంద
మోదసంభరితములైన తుమ్మెదలు పాడు
చున్నవి ప్రేమసంహితాం, తరభిహి
తమ్ములి ప్రకృతితత్వవిచారణవాక్యపంక్తి
తో, సరసములైనవౌ ఉపనిషత్తుల వీసిక
భాష్యమేమియో!'

ఇదీ అప్పటి 'బర్నింగు ప్రాబ్లం'

మఱి కొన్నాళ్ళకు, అది మదరాసు. బంగారు పొగలేసే పట్టణం. మూడునాళ్ళయింది ముద్దదొరికి. ఆత్మాభిమానం ఆంతరంగికులకు కూడా చెప్పనివ్వలేదు. గుక్కుమిక్కుమనకుండా ప్రతిపూటా నాల్గుమైళ్ళు నడచి యూనివర్శిటీ లైబ్రరీలో కూచొని పుస్తకాలు తిరిగేస్తూండే వాణ్ణి. నాల్గోరోజు కదలడానికికూడా కొంతప్రయత్నము కావలసివచ్చేది. ఎట్లో పోయినాను

లైబ్రరీకి. అలా చదువుతూండగానే అక్షరా లన్నీ మాయమై ఒకే నల్లాగితంగా కనబడింది. తలయెత్తి వ్రక్కలవరికిస్తే అంతా అంధకారంగా కనబడింది. ఇంక చదవడంసాగలేదు. సొక్కుతూ, సోలుతూ, మెరీనాలోనికి వచ్చినాను. అంతా కలకల లాడిపోతూంది ఆదివారము గనుక. ఆ రేడియో ఆలాపిస్తూంది పిచ్చిపిచ్చిగా. కానీ యివేవీ నాకు శాంతి నివ్వలేదు. అట్టే ఆ గభీర పారావారం దాపున పశ్చిమాకాశాన్ని వరికిస్తూ పడిపోయినాను. కనులు మూతలు పడినవి. అవరి యత్నంగా, అవ్యక్తవాణి ఉంటూంది:

అదియుడవి;యర్ధరాత్రి;యెయ్యదియుకానరాదు
జతలేరు; మనసునరక్తిలేదు;
శక్తియుఁ లేదు; కాని విశ్రాంతి లేక
యెచటికో? యెందుకో? యేమొ? యేగుచుంటి.

... ... ... ...

అంధకారమ్ములో నేదో అలపరించు
చున్నవాడవు దేనికై సొగయుదయ్య?
వెలుతురే లేనిచోట నీవెట్టిపాట
లెవరు విన్పించుకొందురోయీ?

ఈ అగాధ సముద్రమ్ము నీదనెంచి
యెందఱు హతాశులై నశియించినారొ!

యెందఱి యభాగ్యజీవుల యెడద లిందు
ముక్కలై పోయి నీళ్ళలో మున్గినవియొ!

కాళరాత్రిలో నేలరా గమనచింత?
గమ్యమేలేక యెచటికేగెదవు తండ్రి!
కన్నులేలేని లోకమ్ము కానిపించు
కొనునటోయి నీప్రయాణప్రయానలెల్ల.

ఇదిమఱొకనాటిచింత. మఱి యిప్పుడో?
............ ఇవి తీరే మార్గం యెట్లా?
ఇవెందుకేర్పడినవి? అందుకోసమే ప్రపంచమూ
జీవితమూ అదీ యిదీ అన్నీ విమర్శించడం.

వింటారూ మఱి?

---

# సారస్వతం

పుట్టుపూర్వోత్తరాల పురాణా లెట్లా ఉన్నా సమాజానికీ, సారస్వతానికీ ఒక అవినా భావ సంబంధం అంటుకొని వస్తున్నమాట నిజం.

అనేకరకాలైన మానవులతో నిండుకొన్నది సంఘము. అందులో ఉన్న ప్రతిమానవుడూ పరిసరపరిస్థితులకు అధీనుడై ఉన్నట్లే యీ మానవుల మనస్తత్వాలు మొత్తముమీద ఆ సమాజంపైనకూడా పలుకుబడిని సాగిస్తూనే ఉంటవి. అందుకే సంఘానికి మానవుల మనస్తత్వమూ, 'మనుషుల మనోభావాలకు సంఘస్థితీ అన్యోన్యం నిదానాలు కావడం.

ఈసమాజ జీవనప్రతిబింబమే సారస్వతం. సారస్వతం స్వతంత్రమైనది కానిమాట వాస్తవమే. మానవుడు తొలుతతొలుత అయోమయంగా అద్భుతంగా ఉన్న యీప్రకృతిని చూచి ఆనంద పరవశుడై ఆలపించినా డెన్నోగీతాలు. అవే సార స్వతానికి తొలిచూలు. అట్లా బయలుదేరి రాను రాను సంఘానికే ప్రతిబింబమైనా, తానూ ఆ

సమాజాన్ని కొంతకుకొంత ముందుకు నెట్టుకొని పోవడంలో చేయిజేసుకుంటూ వచ్చింది. అందువల్లనే సంఘుక్రమ పరిణామగతిక సారస్వతం తార్కాణం కాగలిగినది. ప్రాచీన హిందూసారస్వతమే మనచరిత్రకు నిజాన మనకతప్పదు. ఇందులోనే సమాజానికీ సారస్వతానికీ ఉన్న సంబంధం వెల్లడికాగలదు. భారతీయ విజ్ఞానభానుడు వివిధమయూఖాలనూ విశ్వమంతా విస్తరింపజేసినకాలం పోయింది. పరతంత్రవాతావరణం మనలను పూర్తిగా మార్చివేసింది. అంతా అనుదిన జీవితంకూడా అన్యానుకరణం కావలసివచ్చింది. ఇందులో మనసారస్వతంలో కూడా పూరా మార్పువచ్చింది.

మరీ మనలో కొంత కలవరం కల్గింది. ఈ సామ్రాజ్యతత్వంక్రిందబడి నలిగిపోతూన్న మనలోనుంచీ ఒకజ్వాల- స్వేచ్ఛాపిపాస- అవతరించింది. అందుతోపాటు సారస్వతచరిత్రలోకూడా కొన్ని క్రొత్తమొగ్గలు విరిసినవి.

మన ఆంధ్రసారస్వతం కేవలం ఒక శాఖకు సంబంధించే యెక్కువగా పెరిగిపోతూన్నది. ఇప్పుడు నానా విషయాలూ సవ్యఘటితిలో కూర్చుకొని నవనవ లాడడానికి ప్రయత్నాలు చేయడం మొదలుపెట్టినది.

ఇప్పుడున్న మనసమాజం ఒకదశనుండి మరొకదశలోనికి పోయే సంధిలో నున్నది. ఇట్లా ఉన్న సమయంలో దీని నీ టర్నింగు పాయింటు నుండి చక్కనితోవకు మఱలించడంలో సారస్వత సేవకులు చేయవలసిన పని యెంతోఉన్నది.

ఫ్రాన్సులోని కవులు వారి విప్లవానికి కారకులైనారు. రష్యాలోని రచయితలు ప్రతిమానిషి రక్తకణాన్ని నిరంకుశప్రభుత్వ విరుద్ధ పరమాణువులతో నింపివేయగల్గినారు. టాల్స్టాయి గోర్కీ వంటివారి రచనలద్వారా అచటివారిలో అంత విప్లవశక్తి కలగడం.

వేదికలమీాది ఉపన్యాసాలవల్ల, ధర్మబోధ నలవల్ల కలిగేమార్పు తక్కువ. అవి కేవలం కొందఱిని మాత్రమే ఆకర్షింవగలవు. అందులో కొంత 'ఎమోషన్' కల్గవచ్చు కాని అవి సరిగా అర్థంకావడంకూడా కష్టమే. 'దరిద్రం మనలను మాడ్చివేస్తూంది. ధ్వంసం చేసివేస్తూంది. చూడండి' అని జాబితాలు మొదలుపెట్టి మన దేశమునుండి ఇతరదేశాలకు ఎగుమతి యవుతున్న వస్తువులను లెక్కాచారప్రకారంగా విచారించి రైతుకెంత ఆదాయం నిఖరంగా తేలుతుందో చెప్పడం ఒకరకం.

ఒక చిన్నకథలో' రైతు యెట్లా బాధపడు తున్నాడో, ఆతని ఆలుపిల్లలెట్లా తిండికిలేక చలికి అల్లాడుతున్నారో, అతణ్ని సర్కారు నౌకరులు పన్నుకోసం యెట్లాపరితపింపజేస్తున్నారో, ఆపన్ను కోసం అప్పుచేయబోతే షావుకారి యెలా పరిభ విస్తున్నాడో, కడకా అప్పులతో అతని కాడెద్దులతోసహా సర్వస్వమూ షావుకారి కెలా చెందుతున్నదో రచయిత రాసినాడంటే, ఆకథ చదివితే శుభ్రంగా కండ్లకుకట్టినట్లు మనసుకు నాటుతుంది.

అదే ఒక నాటకంద్వారా చూపిస్తే, పల్లెలలోని పాటకజనం చక్కగా అర్థంచేసుకోగలుగుతారు. అదే చిత్రంద్వారా చూపిస్తే, పిల్లవాళ్ళుకూడా "ఆలోచిస్తా రేమిటా"యిదీ, అని.

కాబట్టే రాజకీయవేత్త లందరూ పూర్వం నుంచీ యీ సారస్వతాన్ని దేశాభ్యుదయానికి బాగా ఉపయోగపడేటట్లు చేసుకొనేవారు.

కానీ, రానురానూ మనలో పాలిటిక్సంటే ఎలెక్షన్లలో యెగురులాడడమే ననేంతవరకూ వస్తూంది. ప్రతిసారస్వతసేవకుడూ ఒకరాజకీయ వేత్తకన్నా గొప్పవాడేననీ, యేరాజకీయాలూ యితని కలంపోటుతోనే యెక్కువ ఉన్నతస్థితికి రాగలవనీ మఱచిపోతూన్నారు. మానవజీవితాన్నీ మనస్సునూ పరోక్షంగానో ప్రత్యక్షం

గానో పరిణమింపజేసే పరమోద్దేశ్యంతో ప్రవ ర్తించే సారస్వతానికి దోహదమియ్యలేకపోవడంతో సారస్వతానికీ రాజకీయాలకూ మధ్య అఘాతం యేర్పడిపోతున్నది.

ప్రతి నాయకుడూ దీనిని అర్థంచేసుకో వలెను. సారస్వతసేవనాన్ని కూడా దేశసేవనం గానే భావించి రచయితలకూ యిందులో స్థానం ఉన్నదని గ్రహించవలెను. అందుకు ప్రోత్సాహ మిచ్చి వారి కలానికి మఱింత తీవ్రత కలిగింప వలెను.

సారస్వత సేవకులూ 'కళ కళకోసమే' అను శోక నుగ్గి నుసియయిపోతూన్న మానవులలో మఱీ క్రొత్తఉత్సాహాన్ని జీవనాన్ని కల్గించి అనుదిన చర్యలోనూ అదేధోరణి కల్గేటట్లు వారిని మార్చ డానికి తగినసాహిత్యాన్ని వెలువరించవలెను.

సమాజాన్ని సర్వవిధాలా సమారాధిం చాలనే — సమారాధిస్తున్నామనే-- పెద్దమనుష్యు లందరూ సంపూర్ణంగా వారివలెనే- ఇంకా యెక్కువ గానే — సమాజాన్ని మరమ్మతు చేయడంలో సిద్ధహస్తులైన రచయితలయెడ సహకార సద్భా వాలనుచూపి దేశసౌభాగ్యానికి దారితీయవలెను.

సారస్వతమే లేకపోతే సంఘమే నిలువలేదు.

జాగ్రత !!!

# అనుభవము

చర్చ చేయడానికి చేతకానవ్వాడూ వవ్వులో కాలువేసి సమర్థించుకోవలసివచ్చినవ్వాడూ నీకు 'అనుభవం' లేదు నాయనా! అని సామాన్యంగా దబాయించేస్తుంటారు పెద్దవాళ్ళ మనుకునే వాళ్ళు. అన్నిటికీ యిదే పల్లవి. దీని కను పల్లవిగా, ప్రాక్టికల్ కాదులే మీరు చెప్పేదంతా, అనడ మొకటి. చరణాలు మామూలే—

ఈ అనుభవమనే మాటకు వీళ్ళు అనుకున్నదే అర్థమయితే సమయానికి తగినట్టు చంక లెగురవెయ్యడమే కావలసివస్తుందేమో.

అనుభవమనేది అనేక రకాలుగా ఉండవచ్చు. చాలానాళ్ళు ఆ విషయంలో వడి కొట్టుకోవడం మూలాన్నే అనుభవం అబ్బుతుందనుకోరాదు. అనుభవించే దెవ్వాడూ మనస్సే గనుక ఆయా మనశ్శక్తి కొలదే అనుభవ సామర్థ్యం కూడా ఉంటుంది. కాబట్టే మహాత్ములందఱూ ప్రతివిషయంలోనూ కావలసినన్ని యేండ్లు వరిశ్రమ చేయకపోయినా ఆఁఅని అనేటప్పటికి గ్రి

హించి అందులోని అంతర్మర్మాలన్నీ అవగత మయ్యేటట్టు యితరులకుకూడా బోధింప గల్గుతున్నారు.

ప్రతివాడూ తాను మాట్లాడే ప్రతి విషయంలోనూ యేదో ఒకవిధమైన అనుభవం ఉండబట్టే మాట్లాడుతాడు; కానీ అందులో వారివారి యోగ్యతానుసారం గ్రహణశక్తిని బట్టి విషయ నివేదనం ఉంటుంది.

శ్రీ రాజాజీకి మంత్రిపదవిలో అనుభవం లేదు. అంతకన్నా మంచి అనుభవం కలవాళ్ళు చాలామందే ఉన్నారు. కానీ, ఆయనకు ఆ విషయంలో ఉన్నంత ప్రజ్ఞ అంతకుముందు అనుభవమున్నవారికి లేకపోవచ్చు.

ఒకొక మనిషినిగూర్చి తెలుసుకోవడంలో కూడా అంతే. ఇద్దరికి పదేండ్లు సావాసమున్నా పరస్పరం అర్థంచేసుకొనిఉండనివా రెందరో ఉన్నారు. ఒకటి రెండు మారులు కాఫీహోటలు పరిచయంతోనే వాని పుట్టుపూర్వోత్తరాలన్నీ ఆకళింపుకు తెచ్చుకోగల్గినవారూ ఉన్నారు. ఇంతకూ ఇరవైయేండ్లు కాపురంచేసి పదహైదుమంది బిడ్డలను కన్నా, ఒకరి హృదయం ఇంకొకరికి అర్థంకాని భార్యాభర్తలకు లెక్కలేదు.

పూర్వకాలపు పురాణాలు మొదలుకొని యీనాటి శాస్త్రాలవరకూ కలయజూచినా యేండ్ల తరబడి అనుభవమున్నా అజ్ఞానం, ఒక క్షణం ఓపికతో పరిశీలించినా సుజ్ఞానం, కలిగినవాళ్ళకు లెక్క లేదని సులభంగా తెలుసుకోవచ్చు.

ఇంక 'ప్రాక్టికల్ నాలెడ్జి' అనే మాటకు అర్థ నిర్ణయం చేయడం చాలాకష్టం. ఏ విషయ మైనా ప్రాక్టికల్‌గా ఆలోచించి పరిశోధించే యేసిద్ధాంతమైనా అసలు బయలుదేరి ఉంటుంది. అందులో ప్రాక్టికాలిటీ అంటే ప్రత్యక్ష రామా యణంలాగా కాదు. కాని, భావనలోనే ఆచరణ సాధ్యమా కాదా అనే తీవ్రవిమర్శకు గురియయి తేల్చబడిఉంటుందన్నమాట.

అట్లు కాకుండా ప్రతిదీ అనుభవించిన తర్వాతనే గానీ, ఆచరణలోపెట్టి చూచిన తర్వా తనేగానీ, ఏవిషయమూ చెప్పరాదంటే యింక యేశాస్త్రమూ యేకళా యేవిజ్ఞానమూ అభివృద్ధి కావడానికే వీల్లేదు. అసలు అంకురించడంకూడా కష్టమే.

ఇంక సోషలిజం కమ్యూనిజం వంటి వాటి సంగతి కాకపోయినా కడకు కాంగ్రెసు ఉద్యమం మాత్రం యెవరు ప్రాక్టికల్ అనుకున్నారుచెప్పండి

మొదలుపెట్టినవారు తప్పితే. అది ఇంప్రొక్టి కబులూ, ఇంపాజిబులూ, అని సాగదీసినవారే చాలామంది. కాబట్టి

అనుభవమంటే అది భావనాశక్తితోనూ మనశ్శక్తితోనూ ఆత్మశక్తితోనూ యెట్లా అయినా సరే సకారణంగా చర్చింపబడి తేల్చు కొనబడితే సరి; అందుకు వారివారి తెలివితేటలే కారణం. కానీ అందులో చాలానాళ్ళుండడం కాదు.

ఒక కవిసంగతి చూదుకొనండి. అందరికీ తెలిసిన విషయాలే, అందరూ అనుక్షణమూ అనుభవిస్తున్న విషయాలే, తాను మూడోవాడుగా ఉన్నా అలా భావించుకొని అత్యద్భుతంగా, తానే కాక అతని ఆగీతం చదివినవాళ్ళందరూ, అసలు వాళ్ళకన్నా, అనూనమైన అనుభవాన్ని పొంద గలిగేటట్టుగా వ్రాయగలుగుతున్నాడు. ప్రతి కవీ తాను రాసే వాని నన్నిటినీ ప్రాక్టికల్‌గా లేక — మనవాళ్ళనేటట్టు — అనుభవించి తర్వాత రాయడమంటే వీలౌతుందా అనేది సందేహమే.

దరిద్రంలోనే పుట్టి, దరిద్రంలోనే పెరిగి దానిలోనే అసువులను అర్పించేవారికి ఆదరిద్రాన్ని గూర్చి తెలియడంలేదు. అది వాళ్ళ కర్మ మను

కుంటున్నారు. ఇంక ధనంలోనే పుట్టి ధనంలోనే పెరిగి అమాంతమైన ఆడంబరంతో అనేక వజ్రాలతో అందులోనే సమాధినికూడా కట్టించుకొనే ధనవంతులకు ధనాన్నిగూర్చి తెలుసుకోవడం కష్టంగావుంది. అది వాళ్ళ అదృష్ట మనుకుంటున్నారు. అది వాళ్ళ కర్మగాదు, ఇది వీరి అదృష్టమూకాదు. ఆస్తి స్వత్వంచేసే మెస్మరిజం అని చెప్పేవాళ్ళు, వారిలోనూ ఉండవచ్చు వీరిలోనూ ఉండవచ్చు. అనుభవమంటే ఆనాటిసంగతొకటి జ్ఞాపకం వస్తూంది. నా 'విరికన్నె' ప్రతి నొకదాన్ని ఒక పెద్దమనిషి కిచ్చినాను, — ఆయన మంచిసారస్వతాభిమాని; పదికాలాలపాటు రంగ రంగ వైభవంగా రాజ్యమేలినవాడు. - ఏదో కాస్త ఆనందపడనీ అనో, బాగాఉంది నాయనా అని బహూకరిస్తాడనో యేదో ఒకందుకు. తర్వాత కొన్నాళ్ళకు ఆయన జాబు వ్రాసినాడు నాకు. అందులో యేముందంటే 'మీ విరికన్నెను నా మిత్రులకు చూపించితిని. వారిది అనుభవరసికత వలె నున్నదనుచున్నారు' అని.

నిర్ఘాంతపోయినాను. నిజమే అందులో కొంతకు కొంత శృంగారం ఉన్నమాట. అది కాక మరీ యితర విషయాలూ ఉన్నవి. అయినా

యీ విషయమయ్యే ఆయన వ్రాసిఉంటాడనుకోక తప్పలేదు. అందు కేంబగులు వ్రాయను ?

"........సంతోషించినాను. మింటిక్కి మంటికీ ఆలోచించినా నాకెక్కడా అట్లాంటి వేవీ అనుభవించిన జ్ఞాపకం - భావనలోతప్ప - రావడం లేదు. ఒకవేళ నేనేమైనా పరధ్యానంగా ఉన్నప్పు డేమైనా అలాంటివి జరిగిపోయి, Indirect గా నామనస్సుకు ఇట్లాప్లయను చేసినారో, యేమో చెప్పలేను. ఒక వేళ మీ మత (తియాసఫీ) ప్రకారం పూర్వజన్మలోనివాస నేదయినా తగు లొన్నదో యేమో. ఇంతకూ నాకు తెలిసి నంతవఱకూ అనుభవించడానికి అవకాశమే మో కల్గలే" దని వ్రాసివేశాను. ఇట్లా ఉంటుంది మనవాళ్ళ అనుభవం. ముగ్గురుపట్టు నల్గురిని పెండ్లిచేసుకొని పైగా కొందఱితోఉండే ప్రాక్టికల్ శృంగార పురుషులను నాలుగుముక్కలు రాయ మనండి యెంత మాత్రం రాయగల్గుతారో. ఏమీ లేక ఏ అడవిలోనోవుండి యెన్ని విషయాలు వ్రాయలేదు మహర్షులు.

కాబట్టి యీ మాటలను అనవసరముగా అందఱిమీదా ప్రయోగించి యేసిద్ధాంతచర్చా లేకుండానే దబాయించడం అన్యాయమనీ, శాస్త్ర

కూస్తా అనుభవ మున్నంతమాత్రంతోనే తెలివిగల వాళ్ళెవరయినా చెప్పినమాటలు అనుభవంలేనివనీ వారు చెప్పేనీతులూ నియమాలూ సమాజ విధానాలూ రాజకీయ పరివర్తనలూ అన్నీ "ఇంప్రాక్టికబులూ, ఇంపాజబులూ" అనుకోవడం అనడం అన్యాయం అక్రమంఅనీ, మనవి.

ఔనంటారా! కాదంటారా!

ఇంకా————

పిల్లవాడూ,

అనుభవం లేదులే

అంటారు కదూ!

---

# మంచీ — చెడ్డా

నిజమే, మనిషైనవాడల్లా మంచీ చెడ్డా తెలుసుకోవడం ముఖ్యమే. ప్రతివానికీ మంచివాడు కావాలనే యిష్టముంటుంది. తాను చేసే పనులన్నీ మంచివనిపించుకోవాలనే ప్రతిమనిషీ ఆతుర్దా పడతాడు. చెడ్డవాణ్ణని యెవడూ కోతలుకోయడు. కాబట్టి మంచిచేయవలెను, చెడ్డను పరిత్యజించవలెను, అనే విషయాలలో యే తర్కవితర్కాలూ లేవు; అభిప్రాయభేదాలూ రావు.

కానీ, మంచిఅంటే యేది? యేదిమంచిపని? యెవరుమంచివారు? అనేవిమర్శలోనికి దిగితేమటుకు కొంత అవస్థలపాలు కాకతప్పదు. ఇక్కడే ఉంది తగాదాఅంతా. మంచిచెడ్డల నిర్ణయం అంత సులువైన విషయంకాదు గనుకనే మంచీ చెడ్డా తెలిసినవాడు అంటే ఘనతరావడం.

సమాజం దేనిని ఒప్పుకుంటే అదంతా మంచిదే అని ఒక తరహాగా చెప్పుకోవడానికీ వీలున్నది. అప్పుడప్పుడూ సంఘం నీతులూ నియమాలూ అనే పేరట మంచిచెడ్డలను నిర్ణయిస్తూంటుంది.

పందసంవత్సరాలకు ముందు యేది మంచిదో, అది తర్వాత కాకపోవచ్చు, నరేకదా అసలు చెడ్డదే కావచ్చు కూడాను. అందుకు తగినట్లల్లా ధర్మ శాస్త్రాలు సవరింపబడుతూంటవి. లేదా వేతే సూత్రాలు చేయుబడతవి.

అందులోనూ సమాజం అన్నంత మాత్రముతో అందరి అభిప్రాయమూ అనుకోరాదు. ఇంతేకాదు, అసలు మెజారిటీ యిష్టం అనుకోవడమూ అసందర్భమే. సామాన్యజనం యెప్పుడూ అధికప్రసంగాలకు పోనేపోరు. కాబట్టే యిన్ని దేశాలూ,రాజ్యాలూ యెన్ని చేతులు మారుతున్నా వారికే కాబట్టలేదు.

వారి బీదతనం యితర విషయాలలో జోక్యం కల్పించుకోనీదు. ఏరాజ్యం యెవడేలినా వారి రెక్కలాడితేనేగానీ బొక్కలాడడం సాగదాయె. ఇంక వాళ్ళకిగొడవలలో బడితే కడీ? ఇంక వ్యూర్తిధనికులా అంటే సంఘాన్నంతా తమ ఉపయోగంకోసం ఉపయోగపడేట్లు చేసుకోవాలన్న ఆసక్తి పూరా ఉన్నా బుద్ధినహి. అందుకోసం యెటూగాక ఉన్న 'ఇంటలిజెన్షియా'ను-ధీమంతులను- అండచేర్చుకొని అందుకు ప్లాను వేస్తారు. ఇంక వీరు ధర్మవన్నాలను యేకరువు పెడతారు.

డవట వీరెన్ని శ్రీరంగనీతులు చెప్పినా అసలు వరచడానికేమో తప్పనిసరిగా అధికారం చేతుల్లో ఉండవలెను. అందుకోసం యీ మంచిచెడ్డలు అధికారులకు అనుకూలంగా ఉంటే తప్ప అంగీకరింపబడవు. అంతేగాక వీరిని పోషించేది వారేనాయె, కాబట్టే యీ మంచిచెడ్డలు, ఆయా కాలంలో అధికారసాధ్యబల్యంగల వారి యిష్టానిష్టాలను బట్టి యేర్పడుతూంటవని అనుకోవడంలో అసామంజస్యం యేమీలేదు.

ముచ్చుటకు: యజ్ఞాలూ యాగాలూ అంటే వైదికకాలంలో నడిచేవారు జనం. అంతకు మించిన ఘనకార్యాలే లేవనుకొనేవారు. ఇంతలో అశోకచక్రవర్తి 'నమోతస్స భగవతో అర్హతో సమ్మాసంబుద్ధస్స' అని బుద్ధశరణాగతుడయ్యేటప్పటికల్లా ధర్మాలన్నీ తల్లకిందులైనవి. ఏ విధంగానూ హింస చేయకూడదన్నాడు మహారాజు. జోహుకుం అన్నారు ప్రజలు.

ఇందువల్లనే వందిని పంది చెయ్యడానికి పందిని నందిచెయ్యడానికీ తాహతుగల యీ అధికారవర్గాన్ని మార్చేవాలు. సంఘాన్ని మార్చవచ్చుననే, మతప్రవక్తలు చాలామంది పూర్వం రాజసభలలో వాదాలు సాగించేవారు. అందుపై

పండిత పరిషత్తు ఏర్పడుచ్చేది. ఆరాజ అసలు జరిపేవాడు, కాయ్ కాయ్ అనకుండా జనాలు 'దాసోహం' అనేవారు సామాన్యంగా.

ఇట్లా కాక, సంఘంలో అధికారం చలాయించేవా రొక రకమైన నియమాలు చెబితే సర్వాంగంగా మంచిచెడ్డలను నిర్ణయిస్తూ ఎవరికి యీ దేధీనలూ ఉన్నారు. సంఘం బంధపాశయమై అధికారులను అనుసరిస్తూన్నా బ్రిటీషు సామ్రాజ్యం ఇండియాను ఆక్రమించి వెలిగిపోతుంటే ఇది అన్యాయం అక్రమం అనే ధీమాగల జాతీ నాయకులూ లేపోతేను. అందుకే యీ మంచిచెడ్డల నిర్ణయంలో తప్పులను వెలికిబెట్టి మరోతీర్పు చేయాలన్నారు. కాసీ అందుకూ అధికారం వచ్చేవరకూ అవసర సహకారం లభ్యం కాలేదు. అదీదారక బుచ్చుకొని ఏదో చేయునే చేస్తూన్నారు గదా!

ఇంతా ఉంటే; "అసలీ ప్రస్తుత సమాజ విభాగమే చెడ్డది. ఇది కేవలం ఒకవర్గపు దృష్టితోనే యేర్పడినది. హింసలేని దీసంఘం సాగలేదు. ఒకమనిషి యితరులతో పనిచేయించుకొని ఫలం తాను అనుభవించడం అక్రమం. ప్రతివాడూ బాగుపడవలెను అనే విశాలదృష్టి నశిస్తున్నది. అంతా పరస్పర విరుద్ధశక్తులతో కూడుకొన్న దీనంఘం.

యెప్పుడూ అనవసరఘర్షణకు కారణమైన ఈ సమాజస్థితిఅంతా ఘోరమైంది. సంఘం యిట్లా ఉన్నన్నాళ్ళూ నీతినియమాలు ఉండనే ఉండవు. శాంతి చేకూరదు. సర్వేలూ సంతోషంగా శాంతంగా సుఖంగా ఉండవలెనంటే యీ పద్ధతులన్నీ మారి ఒకసమాజ విధానం యేర్పడవలెను." అనే వాదనతో ప్రపంచాన్నే దిగ్భ్రమచెందించే సిద్ధాంతాలతో క్రొత్తరకంగా మంచిచెడ్డలు నిర్ణయించడానికి ప్రాసుకొన్న వివేకవంతులు బయలుదేరి సంఘశక్తులకు బలిఅవుతూ, తమ అభిప్రాయములను వెల్లడించడానికి, ఆరీతిగా సంఘం పునర్నిర్మాణం చెయ్యడానికీ, బద్ధకంకణులై, అందుకు నిదానమైన అధికారం కోసం కావలసిన కార్యాలాపం చేస్తూన్నారు. దీనికేమంటారు? ఏదిమంచో యేదిచెడ్డో? యెవరు నిర్ణయించేది?

ఇట్లాంటప్పుడు నేనింక మంచీ చెడ్డా అంటూ నిర్ణయించగలిగిందేముంది? ఇంతకూ నేనుచెప్పవచ్చిం దేమంటే, ఇదిమంచిదికాదు ఇది చెడ్డదికాదు అని ప్రతివాడూ నిర్ణయాలివ్వడం అంతసామాన్యమైన విషయంకాదు.

మంచీ చెడ్డా తెలుసుకోవడ మంటే మాటలామరి?

---

# విజ్ఞానం

ప్రకృతి వశుడయిన మానవుడు రానురాను కొంతకుకొంత ఆశక్తులను లోబరచు కొన్నాడు. ఏదిచూచినా వెరగుపడుతూ ఏ భయంకర వస్తువునుచూచినా దేవుడే అనుకుంటూ ఏకంగా ఆ కొననుండి ఈ కొనవరకూ నడుస్తూ వచ్చిన మనిషికి ప్రకృతిలోని గుట్టుమట్టులు తెలుసుకోవడం మొదలుపెట్టవలసివచ్చింది.

తద్వారా ప్రకృతిపయిన అధికారం చలా యించడానికి దారి కనుక్కోవలసివచ్చింది. జిజ్ఞాసే కొంత కార్యరూపంతాల్చి స్వభావ సిద్ధములయినవే కాక స్వంతంకూడా కొన్ని తయారు చేసుకో వచ్చుననే ధీమా కల్గింది.

ఇప్పటికీ అప్పటికీ చూచుకుంటే యెంతో భేదం. యీ విజ్ఞానజ్వాలలు ప్రపంచాన్నే తారు మారుచేసి ఒక క్రొత్త వెలుగును ప్రసాదిస్తున్నవి.

దేశములోని ఆర్థికసంపదనూ ఉత్పాదక శక్తినీ అభివృద్ధి చేయడమే కాక, కేవలం శ్రమ పడడం మూలాన్నే కావలసిన వానిని—అందు

లోనూ అతిస్వల్పంగా అవుతున్న వానిని—సులువుగా, కావలసినంత యెక్కువగా, తయారుచేసుకొనే ఉపాయాలు వీనిద్వారా కల్గినవి.

ఒక దేశంలోని విజ్ఞానాన్నీ నాగరికతనూ ఇంకొకరికి, యేతుణాని కాతుణమే, అందివ్వడానికీ అక్కడి దివ్యసందేశాలను మరోచోటికి కొంపోవడానికీ, ఒకటేమిటి యావత్తు అభివృద్ధికీ యీ విజ్ఞానం చేసినపని యింతా అంతా కాదు.

ఇంతే కాక:

మరో రకంగా చూచుకున్నట్లయితే యిందువల్ల కలిగిన ఘోరాలూ అన్యాయాలూ అకృత్యాలూకూడా లేకపోలేదు. వాటిని తల్చుకుంటే గుండె బ్రిద్దలౌతుంది.

లక్షలాది జనానికి కూలిని పడగొట్టివేసింది. కావలసినంత బీదతనాన్ని సృష్టిచేసింది. పోటీలు; వానిమూలంగా దివాలాలు; తద్వారా ధనాన్ని మరోవ్రిక్క ప్రోదిచేయుడం; ఇందులో ధనిక—దరిద్ర భేదం మరింతతీవ్రమై ఒక సంఘటన కల్గడం తప్పక పోతూంది.

అంతే కాదు; యీ గుట్టలు గుట్టలుగా తయారయిపోతూన్న వస్తుసముదాయాన్ని అమ్ము

కోవడంకోసం, వాటికి ముడివస్తువులను సంపా దించుకోవడం కోసం మన దేశంవంటి అభాగ్య దేశాలను స్వాధీనం చేసుకోవడం, సామ్రాజ్య వాదానికి మరింత బలం కల్గడం. ఇందుకోసం మానవత్వాన్నే విధ్వంసంచేసే మారణహోమాలు బయలుదేరినవి.

కొన్ని వేల మందిని బాంబులతో చంప డంతో తృప్తిపడక యింకా యెక్కువగా విష వాయువులు సృష్టించుకొని ప్రపంచాన్ని నిర్ధూ మధామం చేయుడానికి సిద్ధపడుతూన్న రాక్ష సులతో యీ విజ్ఞానం చేయిగల్పుతూంది.

ఇందుకోసమే యీ విజ్ఞానంవల్ల యెంత మేలుకలుగుతున్నా, యెంత ఆనందానికి ఆల వాలమైనదైనా, దానికితో డీప్రపంచము నాశన హేతువై పోతున్నది. కాబట్టి దీనికి చోటివ్వ గాదనే రకాలైన వాదాలు బయలుదేరినవి.

మరీ వెనకటికాలపు పద్ధతులూ గృహో పరిశ్రమాలూ అందులో ముఖ్యంగా చేతిపనులూ చేసుకుంటూ నిరుద్యోగ దరిద్రాలను యెక్కువ చేసుకోకుండా సుఖంగా కాలం గడుపుకోవడమే మంచిదిగదా అంటారు మహాత్ములు.

ఏమిటీవిజ్ఞానంతో అవసరం? మఱింత విలాసాలకేకదా కారణమిది. విలాసాలకన్నా

శాంతియుతమైన ఆశ్రమజీవితం మేలుకదా. పాత కాలంలో యెంతో ఆప్యాయమానంగా కుటుంబ జీవితం జరుగుతూండేది. అందులోనూ ఇండియా యెంత బాగుండేంది. ఇందువల్ల మనకూ యీ విజ్ఞానానికీ గిట్టదు. దానిదోవదానిది మనదోవమనది. మరీ మనం వెనక్కి టికెట్టు తీసుకోకపోతే యథాప్రకారం ఆర్థికసంకటాలలోపడి గిజగిజా తన్నుకోవలసిందేనని వీరివాదన.

కానీ, యీ తప్పెవరిది? విజ్ఞానందా, లేక దాన్ని సరిగా ఉపయోగించుకోలేని మానవసమాజందా? ఇదే ఆలోచించవలసిన విషయం.

నామట్టుకు నాకుతోచేదేమంటే ఇదంతా మనతప్పే అని. అగ్గి కొంపలు కాల్చివేసేది కాబట్టి దాన్ని పాతమార్చవలెనంటే ప్రయోజనమేమి? దానినే మంచిపద్ధతిలో ఉపయోగించుకుంటే యెన్నోపనులు చేసుకోవచ్చు.

అట్లే విజ్ఞానంవల్ల కలుగుతూన్న యీ అవకాశాలన్నీ ఉపయోగించుకోవడానికి వీలులేకుండా పోవడం యీ ధనికపద్ధతివల్లనే కాని మరేమీ కాదు. అందుమూలాన యే కొందరికోతప్ప యితరులకు వీలుకావడంలేదు ఆ విజ్ఞానాన్ని మూచూడడానికైనా.

పోటీలకూ యిన్ని తగాదాలకూ కారణం ఆ స్వేచ్ఛావ్యాపారపద్ధతే కానీ మరేమీకాదు. ఇదే విజ్ఞానం అన్నివిధాలా ప్రతిమానవునికీ అందు బాటులో ఉండేటట్లు చేయడానికి అందువల్ల యేవిధమైన తగాదాలు లేకుండాచేసుకొని ఆనంద మయమైన భూతలస్వర్గాన్ని నిర్మించుకోవడానికీ వీలులేకుండా పోలేదు. అందుకు తగిన సిద్ధాం తాలకూ తక్కువకాలేదు. అదే ధోరణిలో దారి చూపిస్తూన్న దేశాలూ లేకపోలేదు. అందుకోసమే ఆత్మార్పణంచేసిన చేస్తూన్న చేయగల ధీరులకూ లోటులేదు.

అయినా యెప్పటికో అంటే
అయినప్పటికే ఆనందం.

అప్పుడే అహింసా సత్యమూ సుప్రతిష్ఠితములు కాగలవు.

---

# విలాసాలు

రాను రాను విజ్ఞానం అభివృద్ధి చెందుతూన్న కొద్దీ, విలాసాలని అంతకుముందు అనుకుంటూన్నవెల్లా అవసరాలుగా మారిపోతున్నాయి. అసలీ అవసరాలకూ విలాసాలకూ మధ్య ఒక గీటుగీచి చెప్పడమే బహుకష్టం.

పూర్తి పాతకాలంలో గడ్డలుకూడా విలాసాలే. మరి చీనిచీనాంబరాలు విలాసాలు. అవి యేకొద్దిమందికో మాత్రమే లభ్యమై వారిని విలాసవంతులుగానూ విలాసినులుగానూ తయారు చేసేవి. ఇట్లా యేవేవి కొంతమందికి మాత్రమే అందుబాటులో ఉండి యెక్కువ ధనవ్యయానికి కారణభూతాలై విజ్ఞానస్థితిని తెల్పేటివిగా ఉండేవో అవెల్లా విలాసాలనుకోవచ్చు.

అవసరాలంటే మరీ 'రియాక్షనరీ' గా లక్షణం యేర్పఱచవలసివస్తే బ్రతకడానికి అవసరమైనవీ, అసలవి లేకపోతే ఒక గడియకూడా జీవితం జరగదు అనేరకంగా ఉండేవీ, అని చెప్పుకోవచ్చు.

కానీ, మరీ విజ్ఞానవేత్తలైన పాశ్చాత్యులే 'తిండి మాత్రంతో మనిషి బ్రతకలేడు; అంతకు పైగా కొంతైనా కావా'లని అన్నారు. ఎప్పటికైనా బ్రతకడానికి అవసరమైనవే కాక మనఃప్రసాదాని కాకరమైనవి ఉండితీరవలసివస్తుంది.

అయినా ఆయాకాలాల్లో ఉన్న జీవితస్థితిని Standard of life - బట్టి విలాసాలుంటాయి. ఎంతైనా తప్పకుండా శరీరత్రాణకే గాక మనస్తృప్తికి కావలసివచ్చినప్పుడు, అసలెంతవరకూ మానవమనశ్శక్తి పోతుందో అంతవఱకూ అవసరాలుగానే భావించుకోక తప్పదు.

ఒక రేడియో ఉందనుకోండి. అది విలాసాలలోదే. కానీ, ఇప్పుడు యేగంటలో ప్రపంచములో యేమి మార్పు కలుగుతూందో అనేస్థితిలో ఉన్నప్పుడు, యీ రేడియో విలాసాలలో నుంచీ అవసరాలలోకి దిగక తప్పలేదు.

పూర్వం ఒకవూరికీ యింకొకవూరికీ పోవలసిన అవసరమేలేక కేవలం యేగ్రామానికాగ్రామం స్వయం సంపూర్ణంగా ఉంటూన్న కాలంలో బండ్లూ బడకలూ విలాసాలు. రాను రానూ ఒక ప్రపంచానికీ యింకొక ప్రపంచానికీ సంబంధ బాంధవ్యాలు కల్పించుకోవలసి వస్తుందేమో అనే స్థితిలో ఉన్నప్పుడు, కాళ్లూ బస్సులే

కాక విమానాలుకూడా అవసరాల జాబితాలో యెక్కవలసి వస్తుంది. కాబట్టే మొన్న రాజకోట సంగతుల్లో సర్దార్ పటేలు విమానయానం చేసి చేరుకోగలుగుతున్నాడు.

కానీ,

యింతవరకూ బాగానేవున్నా యీ ధనిక పద్ధతి - Capitalism - లో ఈలాంటి అవసరవస్తువులుకూడా యేకొద్దిమందో పొవుకార్లకోగాని కొనడానికేగానీ, కడకు చూడడానికిగానీ వీలుకాకపోతున్నందువల్ల ఇట్లనేవుంటే వాళ్ళందఱూ తిరగబడతారేమో సనే భయంకొద్దీ యింక యధావిధారం పాతపాటలు కొత్తరాగాల్లో పాడడం మొదలుపెట్టినారు.

ఏమంటారా: యీ విలాసాలన్నీ మంచివి కావు. కేవలం 'సింప్లిసిటీ' నేర్చుకోవాలి. యెప్పటికీ యివన్నీ మానసికవికారాలకు కారణాలౌతవి. ఒక పటకుటీరం నిర్మించుకొని యీతచాపొకటి వేసుకొని బలకరమైన జొన్నసంగటీ, రాగిఅంబలీ తాగుతూ చేతిపనులు చేసుకొంటూ యేమూలలోనో ఉండడమే ఆదర్శం. భౌతికంగాకాక ఆధ్యాత్మికంగా సంపూర్తిని చెందడానికి మానవుడు 'తన్నుదా' తెలుసుకోవాలి. ఈవిలాసాలన్నీ వదలుకోవాలి ప్రకృతిలోనేవుంది ఆనందమంతా.

ఇదీ ధోరణి.

ఒక షావుకారి ఉండేవాడు. ఆయన పాపం అన్నిరూపాయలూ వడ్డీకిచ్చి వరంగళ్ళు బెట్టి వ్యాపారం జమాయిస్తూఉన్నా సాయంత్రమైతే పంచటరుగుల మీద ఒకచిఱిచాప వేసుకొని చొక్కాకూడా లేకుండా ఒక టువాలు వేసుకొని వండుకొనేవాడు. అందఱూ అబ్బా యేమిగొప్పవా డనుకొనేవారు. ఇదేమిటో!

కాబట్టి విలాసాలు అనుభవించక పోతూనే గొప్పదనమూ రాదు; అవి అనుభవిస్తూన్నా తప్పే మీ లేదు. గతిలేక యేదున్నా మేగానీ, ఉంటే రేడియో వినకూడదా! విమానాల్లో ఎగరకూడ దా! ఆనందంగా ఉండకూడదా! మరీ కావలసి నన్ని వస్తువులను ఉంచుకోకూడదా! అట్లా అంటే మరీ ఉన్నవాళ్ళు ఏమైనా ఉంచుకోవచ్చునట. కానీ ఒకటీలేనివాళ్ళకు మాత్రం ఉపదేశాలు చేస్తారు విలాసాలు మంచివికావని. ఏమి పక్షపాతదృష్టి! ఇదంతా ధర్మం, న్యాయం, విధి. కానీ, కొంచం విలాసజీవితాన్ని అనుభవించడానికి యేమీలేనివాళ్ళకూ హక్కున్నది అని అంటే అది అక్రమం అధర్మం, ఘోరం.

ఇవంతా యెప్పుడు నశిస్తాయో?

---

## సమాధానాలు I

కొంతటి సంశయాలివి: 1. రష్యాలోని సోషలిస్టు విధానం మనదేశానికి పనికిరాదు. 2. యువకసంఘాలవల్ల విభేదాలెక్కువై పోవును. ఈ రెండు విషయాలూ వరుసగా ఆలోచిస్తాము.

మానవసమాజం రాను రానూ విశాలమౌతూంది. భౌతిక ప్రపంచములోనూ మానసిక ప్రపంచములోనూ చాలా మార్పులు కలుగుతున్నవి.

అవిచ్ఛిన్నంగా మారిపోతూన్న సంఘంలో అప్పుడప్పుడు వ్యక్తిప్రయోజనాలకూ సంఘ ప్రయోజనాలకూ సంఘర్షణ యేర్పడక తప్పడంలేదు. అప్పటి కప్పుడే ఆకలతలను తొలగించడానికి సమాజ నిర్మాణాన్ని సరిజేసుకొనేవారు. కాబట్టే అనేక సంఘపద్ధతులూ రాజకీయ నిర్మాణాలూ కొత్త కొత్తగా బయలుదేరడమూ సమాజాన్ని సంస్కరిస్తూండడమూ. ఇందులో సోషలిజం అనేది ఒక పద్ధతి.

ఇది కేవలం రష్యాకోసం రష్యాలోనే రష్యా నాయకులతో రష్యాకు సరిపడేటట్టు సృష్టిచేయ

బడినది కాదు. ప్రపంచమంతటా వ్యాపించిపోతూ ప్రతిమానవుని హృదయాన్ని వణకిపోయేట్లు చేస్తూ దరిద్ర నిరుద్యోగ భీకరనృత్యాంతోనూ పరపీడన ఘోరాట్టహాసాలతోనూ దద్దరిల్లిపోతూన్న ప్రేమపూరిత హృదయాలలో యేర్పడిన భావలత. ఇది కవిత్వంకాదు; కన్నీళ్ళు.

ఎక్కడచూచినా యీ ధనికపద్ధతిలో కనబడుతున్న ఘోరాలు, పరస్పర సంఘర్షణాలు, స్వార్థపరత్వం, ఒకరినొకరు యేడ్పించుకొని తినడం, యుద్ధాలు, యివన్నీ చూచిచూచి వేసారి వీటికి మూలకారణమేమిటి? యెన్నిరోజులైనా యీ దరిద్రులంతా హతమైపోవలసిందేనా? అని ఆలోచించి, ఆ మూలసూత్రాన్ని తొలగించి వేయడానికై యేర్పాటైన తత్త్వము. పెర్సీబెడ్డీ—ఇతడు సోషలిస్టు కమ్యూనిస్టు కాడు—అనే రచయిత United Philosophy of Life అన్నాడు.

ఇటువంటప్పు డిది కేవలం రష్యాకోసం పుట్టిందనరాదు. ఆకలి యేదేశంవాణ్ణయినా మాడ్చివేస్తుంది. నిరుద్యోగం యెవణ్ణయినా కన్నతిప్పలూ పెడుతుంది. పరపీడన యెక్కడైనా పాడుచేస్తుంది సంఘాన్ని. ఈ చీడపురుగులు యెక్కడైనా తొలిచివేసేవే. పై సమస్యలు యితర

దేశాలలో ఉన్నట్టే మనకూ ఉన్నాయి కాబట్టే మనమూ వానిని తొలగించుకోవాలనే ఆశిస్తు న్నాము. అందుచేతనూ రష్యాలోని పరిస్థితులూ మన పరిస్థితులూ అందూపొందూ ఉన్నవే.

ఈ పరపీడనను తొలగించడానికే వారెంత కష్టపడినారు. అందుకు కేవలం "పరులను పీడిం చకు" అని ధర్మబోధమాత్రించేస్తే ప్రయోజనం లేదు. మన సమాజవిధానమే అట్లా చేస్తూంది. ఆ మనుష్యుల తప్పేమీలేదు. కాబట్టి పద్ధతి మార్చకుండా మనుకున్నారు. ఒకనికి వెయ్యి యకరాలుండవచ్చునని ఒప్పుకుంటూ, మరీ అతడు ఒకనితో పనిచేయించుకొనడానికి లైసెన్సు యిస్తూ, మరీ వారి కేకొంచెమోయిచ్చి మిగత దంతా వెనక్కు వేసుకోవడానికి చట్టాలు చేస్తూ, పైగా 'పరులను పీడించవద్దు' అంటే ప్రయోజనం యేముంది? వారిని తిడితే లాభమేముంది? జాతీయ సంపత్తికంతా ఆధారభూతాలుగా ఉన్న యీ ఉత్పత్తి సాధనాలను, భూములూ, గనులూ, పెద్ద పెద్ద ఫ్యాక్టరీలూ, వీటినన్నిటినీ సమాజానికి ఒప్పించి, ఒక్కడు మరొకని కష్టంమీద లాభం తినడం మంచిదికాదని, అటువంటి పద్ధతినే తొల గిస్తే సరిపోతుందని ఆవనిచేసినారు. వారి ఆదర్శం అదే. దానినుండీ యెవ్వుడూ మరలలేదు. వారు

కోరదగిన దింకేమీలేదని కాదు. అసలీ రోగాలు ముందుపోతే అందచందాల సంగతి ఆతర్వాత. భౌతిక వాతావరణంలోని అశాంతి మానసిక శాంతినీ, ప్రేమనూ భంగపరుస్తుంది. అదిపోతే వాణివాణి అభివృద్ధి వాడుకాడే చూచుకోవడానికి వీలవుతుంది.

ఇది సరైనదైతే అందరూ యెందు కనుస రించలేరు? అనే ప్రశ్న సరికాదు. మహాత్ముని ప్రేమ శాంతి సిద్ధాంతాలు యేదేశ ప్రభు త్వమూ అనుసరించడంలేదు. కాబట్టి ఆ సిద్ధాం తాలు మంచివి కాదనడానికి వీల్లేదుకదూ?

రష్యాలోని పరిస్థితులను గూర్చిన ఆశంకలు. చర్చీలకూ పెద్దపెద్ద జమీందారులకున్నంత సం సారం ఉండేది. వానినంతా తొలగించినారు. బళ్ళకు రీడింగురూములకు తావుచాలకపోతే, అసలు అట్టిసంస్కృతికే నిర్మితాలైనా కేవలం అలంకార ప్రాయంగాఉన్న వానిని, విజ్ఞాన పాఠశాలలుగా తయారుచేసినారు. అప్పుడూ యెవడంతట వాడు మతంగూర్చిన అభిప్రాయా లుంచుకోవచ్చు నన్నారు. యిప్పుడూ అన్నారు. అంతే.

వివాహం అక్కరలేదని యెప్పుడూ చట్టాలు చేయలేదు. 1918 లోని మొదటి సోవియట్

కాన్‌స్టిట్యూషన్‌నుంచీ 1936 డిసెంబరులో వచ్చిన కొత్త చట్టంవరకూ వివాహాలు వద్దనీ అనలేదు, వానిని ప్రోత్సహించనూలేదు. ఎవరైనా అట్లా పుస్తకాలలో వ్యాసాలలో వ్రాశారంటే అట్లా అన్ని దేశాల్లోనూ రాస్తున్నారు.

స్వంత ఆస్తిని తీసివేయడంలో, ఒకరిని పీడించడానికి అనువయ్యే, ధనం పోగుపడడాని కనుకూలించే, ఉత్పత్తి సాధనాలమీద వ్యక్తి స్వత్వం ఉండకూడ దన్నారు అంత అశాంతికీ యిదే కారణం కాబట్టి. అంతేకాని కొంపా గోడ, పెండ్లామూ దుస్తులూ ఇట్లాటి వస్తువులు స్వంతంగా ఉండకూడదని యెవ్వడూ అనలేదు.

అంతూ పరపీడనవద్దనే మూలసూత్రానికి విరుద్ధంగా యేమీ మార్పుచేయలేదు. అప్పుడప్పుడు కొన్ని NEP లాంటి మార్పులుచేసింది నిజమే. కాని అసలు సిద్ధాంతాలలో మూలసూత్రాలలో యే కొంచెమైనా మారినాయా? ఇది శాశ్వతమా అంటే శాశ్వతమనేదిలేదనేదే మావాదము. అసలు దృశ్యప్రపంచంలో శాశ్వతమే లేదన్నారు మన మహర్షులే. ఇప్పటి కీపాడుపిశాచాల మారణ హోమాని కిది మంత్రమంటే యెన్నియుగాలిది శాశ్వతమంటే ఆ సంగ తెవరు చెప్పగలరూ?

తిండితీర్థంలేని వ్యక్తిస్వాతంత్ర్యాని కర్థంలేదు. అక్కడ నియంతృత్వంలేదు పార్టీ నియంతృత్వం. మన కాంగ్రెసు వర్కింగుకమిటీ యెలా కాంగ్రెసు రాష్ట్రాలన్నిటికీ ఒక నియమితవిధానాన్ని సూచిస్తూంటుందో అట్లే సోవియట్ కంట్రోలింగు కమిటీ చేస్తుంది. ధనికప్రభుత్వాల దాపున కొత్తపద్ధతితోనున్న రష్యాలో ఒక పార్టీ నాయకత్వంతో తమ ఆదర్శాలను అందుకోవడానికి ప్రయత్నించడంలో లోపమేమీలేదు. బువ్వకులేని స్వాతంత్ర్యం యెన్నాళ్ళుంటుంది? ఒకనికింద తిండికిపనిచేసేవాడు పరోక్షంగానో ప్రత్యక్షంగానో వాని ఆశయాలకు బద్ధుడు కాక తప్పుతుందా.

ఇట్లా చిన్నవ్యాసంలో రష్యా పరిస్థితులు వ్రాయడం సాధ్యంకాదు. అక్కడికిపోయి కండ్లారా చూచివచ్చిన సోషలిస్టులూ కమ్యూనిస్టులే కాక ప్రపంచ విఖ్యాతులయిన 'వెల్సు, లాస్కీ, షా, వెబ్బుదంపతులు, రోమారోలాం రవీంద్రనాథ టాగోర్, జవహర్ మొదలయిన వారి వ్రాతలు చదివితే తెలుస్తుంది. ఇందఱూ పక్షపాతంతోనే రాస్తారా? అయితే అనసే అక్కడ లోపాలులేవా? అంటే, ఉండొచ్చు, ఆలోపాలూ లేకుండా, మనకు సోషలిజం వచ్చినప్పుడు చేసుకుందాములే.

రష్యావారు అనాగరికులని యూరోపులో అంటారనీ, వారా మనకు నాగరికత నేర్పేవారని, సహృదయులనరాదు. ఇట్లాగే హిందూదేశాన్ని గురించి చాలామంది అన్నారు. అంటూనే అయిపోయిందీ. అక్కడే సుప్రసిద్ధులు, టాల్స్టాయి వ్రాతలు బయలుదేరి మన మహాత్మునితోనూ మన్ననగాంచినవి. అక్కడే డూస్టవాస్కీ, గోర్కీ. మొదలయిన వారుండింది. ఆ దేశమే యీనాడు ప్రపంచంలో శాంతిని కాపాడడాని కొక కొత్త విధానాన్ని అనుసరిస్తూంది.

చెట్లుపుట్టడానిక్కీ సిద్ధాంతా లనుసరించే దానిక్కి సంబంధంలేదు. Magnesium Sulphate ఆ దేశాలదైనా యీదేశంలో తీసుకున్నా భేది అవుతుంది. సింకోనాచెట్టు పరాయిదేశందైనా మన దేశంలోవాళ్ళకు జ్వరంవస్తే యిస్తేబాగవుతుంది. అహింస, సత్యం, శాంతి, యివన్నీ యెట్లా అన్నిచోట్లా ఒకటేనో, యీపరపీడన కూడదనే సిద్ధాంతమూ అంతే. మూలసూత్రాలు అన్నిచోట్లా మానవస్వభావంలో ఒకటే.

సీతమ్మ ముక్కును లక్ష్మమ్మకు తగిలిస్తే అందంగా ఉంటుందని ఆప్రయత్నం చేయడం యెంత "మూర్ఖలక్షణ" మో సీతమ్మ తనపిల్లలను సమానంగా చూచుకుంటూ ఒకుదుడుకులు లేకుం

డా సంసారం నడుపుకోవడానికి తగిన సౌశీల్యాన్ని అలవరించుకోనిందంటే, లక్ష్మమ్మ కా సౌశీల్యం యెట్లా సరిపోతుంది అనడంకూడా అంతమూర్ఖ లక్షణమే కాకపోతుందా? 'దేశమంటే మట్టికా దోయ్ దేశమంటే మనుషులోయ్' అన్నాడు అప్పారావు.

ప్రతిదీ మక్కీకి మక్కీ, తేదీలు వారాలు సంఘటనలూ అన్నీ రష్యాలోలాగా కావాలని యే వెర్రివాడు అన్నాడు? ఆసోషలిస్టు మూల సిద్ధాంతాలద్వారా సమాజాన్ని నిర్మిస్తే లోకంలో శాంతిభద్రతలను సరీగా కాపాడడానికి వీలవుతుం దనే. కొన్ని అవసరమార్పులు విధానాల్లో ఉం డొచ్చు. ఎవరొద్దన్నారు? కాబట్టి సోషలిస్టు మూలసిద్ధాంతాలూ ఆ సమాజవిధానమూ ఒక్క రష్యాకేకాదు అందరూ అనుసరించొచ్చు. యె క్కడ పీడనా, దరిద్రమూ, నిరుద్యోగమూ ఉంటే అక్కడంతా వానిని తొలగించుకోవడాని కిది పనికివస్తుంది అనిమనవి.

సహనా వవతు సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై
తేజస్వి నావధీతమస్తు
మావిద్విషావహై
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# సమాధానాలు

## II

ఏదైనా ప్రత్యక్షంగా కనబడుతున్నదానిని అసలు తీసివేస్తేతప్ప, పయికి లేదని అంటూనే పోదు. ఏ భేదమైనా ఉన్నా దానిని తొలగిస్తే అప్పుడు ఏకత్వం ఏర్పడుతుంది. కాని, లేదని అనుకోమంటే సాధ్యంకాదు.

ఎప్పుడు ఆరంభమైందో సరిగా ముహూర్తం తెలీదు. కానీ మానవ సమాజంలో రెండు వర్గాలు స్పష్టంగా కనబడతూనే ఉన్నాయి. ఒకరి ప్రయోజనం మరియొకరి ప్రయోజనానికి విరుద్ధమైనప్పుడు తప్పకుండా వీరిమధ్య తగాదాలు కలగడం, తిరుగుబాటులు జరుగడం, తప్పదు.

ఇది కేవలం పైవర్గాలమీాది ద్వేషంతో కాక కిందివర్గాలమీాది ప్రేమతోనే, అధఃపతితులైనవారిని ఒక స్థితికి తీసుకరావాలనే ప్రయత్నంమీాదనే, జరుగుతూన్నా, ఆ తిరుగుబాటులు కేవలం పైవారిమీాది అసూయతో కలుగుతున్నాయని యింకొకవర్గంవారు ప్రచారం చేయడము జరుగుతూంటుంది.

పుచ్చుకుని పాలకపాలితుల సంగతి తీసు కుందాం. భారతదేశాన్ని పరిపూర్ణంగా బాగు చేదామనే ఉద్దేశంతో నాగరికతను నలువైపులా వెదజల్లాలనే తలంపుతో వచ్చినామని చెప్పు కుంటూన్న బ్రిటీషు సామ్రాజ్యతత్వం మన దేశాన్ని పూర్తిగా నాశనంచేయడానికీ, వ్యాపా రం ద్వారా ఉన్నధనాన్ని దోచుకోవడానికి మొదలుపెట్టి పూర్తిగా మన సౌభాగ్యసౌధాన్ని కూలద్రోయడం ఆరంభించింది.

ఇటువంటి స్వార్థపరిపాలక వర్గాన్ని ధిక్క రించక తప్పదని ఈదేశంలో నిద్రాణమై యున్న జీవశక్తిని మేల్కొలిపినారు.

దాస్యబంధనాలలో కుర్రింగి కుర్రింగి కృశించి పోయి స్వతంత్రవాయు ప్రసారమే లేక చైతన్య విహీనమైయున్న భారత ప్రజా హృదయాన్ని కదల్చినారు. 'మన ప్రజల సౌభాగ్యంకోసం మనం పాటుపడితీరాలి. మనక్షేమాన్ని యేమాత్రమూ పాటించక వారి స్వార్థాన్నే ప్రధానంగా చూచు కొంటూన్న పాలకవర్గంపైన తిరుగుబాటు చెయ్యాలి. ఇదేమిటీ ఘోరం? మా సంపద నీవిధంగా మీరు దోచుకొనడమేమిటి అని అడగాలి.' అంటూ గొప్పగాప్రచారం చేసినారు.

విజృంభించేశక్తి కొక కర్తవ్యమైన మార్గం. ఒకస్వరూపం యివ్వడంకోసం సంఘ నిర్మాణం చేసినారు. కాంగ్రెసు సంస్థ ద్వారా పోరాటం సాగిస్తూ పాలకవర్గంపైన యెదురుతిరిగి విచ్ఛిన్నమై విధ్వంసమై పోతూన్న దేశస్థితిని బాగుపరచడం కోసం కంకణం కట్టుకొన్నారు.

కాని యిదేమిటీ భేదకల్పన. మనలో మనం సరిజేసుకోగలమా? కేవలం వారితో మన కేమైనా తగాదాలుంటే కలుసుకొని మాట్లాడు కొని యేదో పిటిషన్లు పెట్టుకొని సరిజేసుకోవాల గానీ యీ శాసనధిక్కార మేమిటి? పాలకవర్గా న్నెప్పటికైనా మనం యెదిరించవచ్చునా? యిటువంటి ఉద్యమాలవల్ల యెన్ని నష్టాలు. వారికీనష్టం మనకూ నష్టం. యెంతమంది జీవనాలు నాశనమై పోతాయి! యెంతమంది చెడిపోవలసి వస్తుంది! ఇటువంటి అశాంతిని దేశంలో తీసికొని రావడమేమిటి? యిదంతా తప్పంటూ సాగదీసిన వారూ ఉన్నారు. అయితే మాత్రం యీ భేదం తప్పిందా.

పాతకావ్యాలుచూచినా అందులో ధనాన్ని నిందించడం కనబడుతుంది. బుద్ధ భగవానుని జాతకకథలుచదివితే యీధనికుల దౌరాత్మ్యాన్ని

చిత్రిస్తూ వారు బీదల సేవిధంగా యేడ్పించేదీ, ఆబీదలకోసము మహానుభావుడు త్యాగంచేసి వారి హక్కులను నిలబెట్టడంకోసం ఆత్మార్పణం చేసిందీ యెన్నిచోట్లనో గోచరిస్తుంది.

'ధనవతితో దరిద్రునకు చెలిమి పొసగ'దం టాడు పోతన్న. అతడే

'ఫలరసాదుల గురియవే పాదపములు
స్వాదుజలములనుండవే సకలనదులు
పొసగ భిక్షము పెట్టరే పుణ్యసతులు
ధనమదాంధుల కొలువేల.........'

అన్నాడు. యిట్లా యీ విభేదం తాతలకాలం నుంచీ ఉంది.

కానీ, అవిభేదాన్ని తొలగించడానికి ఆ యా కాలాల్లో ఆ యా విధానాలను అనుసరిస్తూ వచ్చినారు. యీధనం ఒకచోటనే కేంద్రీకరింప బడి దారిద్ర్యాన్ని యెక్కువ కాకుండా చేయడం కోసం యెన్నో ధర్మశాస్త్రాలు చేసినారు. ధనం మీద హేయభావం కలిగేటట్టు చేసినారు. అయినా సాధ్యంకాలేదు.

మరి మరీ ధనం కేవలం ఉపభోగ్యవస్తువే కాక ధనాన్నిసృష్టిచేయడం కోసం ఆరంభించి

పూర్తిగా ధనికదరిద్ర భేదాన్ని పెంపొందించింది. యంత్రయుగంతో, మరీ యజమానులూ కార్మికులూ అనేభేదము తప్పలేదు. అట్లే రయితులూ కూలీలూ.

యీ భేదాలు కేవలం నాయకులు కాగోరే వారి అడ్డగోలుతలవల్ల కాక స్వభావసిద్ధంగా, కాలక్రమ పరిణతి ననుసరించీ ఆర్థికస్థితిపైన ఆధారపడీ యేర్పడినవే.

అట్లే దేశాన్ని నడుపుతూన్న పాలకపాలిత వర్గాల పోరాటంలోని సంస్థలో కూడా ఆయావర్గాల ప్రతినిధులూ వారివారి ఆదర్శాలూ విధానాలూ కలిసిఉండడంతో విభేదాలు తప్పనిసరిగా వుండితీరును. మతకలహానికీ వర్గకలహానికీ నంబంధంలేదు. ఒక రైతు మహమ్మదీయుడో హిందువో క్రైస్తవుడో అయినా, ప్రభుత్వం పన్నువేస్తే సమానంగానే అలవరిస్తాడు. తన స్థితి కోసం పాటుబడతాడు. తనవర్గాన్ని కూడ గట్టుకుంటాడు. యేమేమో తనకు కావలసిన విధానాలన్నీ అనుసరిస్తాడు. అట్లాగే ప్రతి అధఃపతితవర్గమూ చేస్తుంది. అటువంటి అధఃపతిత వర్గము లన్నిటికే కాక పాలకవర్గంతో దెబ్బతిని పడిపోతున్న దేశీయధనికులకూ కూడా అండగా

ఉన్నది కాంగ్రెసు. ఈ సంస్థ స్వరాజ్యంకోసం పోరాడుతున్న మాట వాస్తవమే. కాని అందరికీ ప్రతినిధిగనున్న యీసంస్థ కార్యక్రమం యే యే వర్గాలవారు తమకు తగినట్లుండాలని కోరుతూ అటువంటి కార్యక్రమాన్ని కాంగ్రెసు ఒప్పుకొనేటట్లు చేయాలని పోరాడుకోవడమూ పరిపాటే. స్వరాజ్యిస్టులు నో చేంజర్లు, శ్రీనివాసశాస్త్రి మొదలయిన వారివంటి మితవాదులూ, అతివాదులూ, యిట్లా తగులబడుతూండడమూ కడకు ఆవేగాన్ని ఆపుకోలేనివారు జారుకొని పోతూండడమూ మనం గమనిస్తూనే ఉన్నాము. యీ యాభై యేండ్లల్లో కాంగ్రెసు చరిత్రలో యెంత మార్పు కలిగిందో మనకు తెలీకుండాపోలేదు.

స్వరాజ్య మన్నంతమాత్రంతోనే కాక దానికొక స్వరూపాన్ని నిరూపించడంకూడా అవసరమేఅయింది. అందుకే మహాత్ముడు రామరాజ్యమనడం. స్వరాజ్యం జర్మనీలో, జపానులో, అమెరికాలో, ఇంగ్లాండులో అన్నిచోట్లా ఉంది. మన కంతమాత్రమే కాదు. అందుకోనమే అయితే ప్రజాసామాన్యానికి పోరాటంతో పనేముంది? స్వరాజ్యం సర్వజన సౌభాగ్యం కోసం. అట్టి ఆర్థిక రాజకీయ నిర్మాణాలను యేర్పఱచడం కోసం అవసరం. అందుకే అందఱూ అందుకోసం

ఏకంగా పనిచేస్తున్నాము. ఇంత మాత్రంతో వర్గభేదమే లేదని చెప్పడానికి వీలవుతుందా ? యీ విభేదాలను తొలగించేవరకూ యిదిపోవు. మూసి పెడితే కూర పాసిపోతుంది. స్పష్టంగా గడియ గడియకూ జలగపీల్చినట్లు రక్తాన్ని పీల్చివేసే ధనిక తత్వాన్ని, తన్ను నిర్జీవిగా చేసివేస్తూన్న దరిద్రాన్ని, యెట్లా మానవుడు మరచిపోగలుగుతాడు?

అశాంతి కలుగుతుంది అంటే తప్పదు. బ్రిటీషు ప్రభుత్వంతో సత్యాగ్రహంచేస్తే అశాంతి కలుగుతుందని ఊరకున్నామా? యెంత అల్లకల్లోలం బయలుదేరలేదు. కానీ ఆ అశాంతి శాంతికోసమే అయినప్పుడు, ఊరకేఉన్నా యీ అశాంతి మరింత అధికమై పోతున్నప్పుడు, గతి ? అందుకై పిల్లనుగనేటప్పుడు తల్లి యెలా నొప్పులు తినక తప్పదో అదేవిధంగా ఒక సమాజవిధానం యింకోరకంగా మారేటప్పుడు కొంతఅలజడి కాక తప్పదు.

పరిణామమూ విప్లవమూ అనేవానికి అసలు చెట్టుకూ గారడిచెట్టుకూ ఉన్న భేదం కానేకాదు. ఎన్నోయేండ్లుగా చేసిన కృషి ఫలితంగా యెన్నో దినాలు కుమిలి కృశించి కలతనొందిన సంఘంలో నుంచీ ఒక్కసారి బయటికి వస్తుంది. నీళ్ళు

కాచడం మొదలుపెడితే వెచ్చబడేవరకూ కొంత నిదానంగా శాక మెక్కుతూ వస్తుంది. తర్వాత సరసైన వేడైపోతుంది. ఒక సైకిలు వేగంగా తొక్కుతూపోతే దానంతటది ఒక తగ్గువప్రదేశం వచ్చినప్పుడు మరీ వేగంగా పోతుంది. తల్లి కడుపులో పిండం తొమ్మిదినెలలూ అంగాలన్నీ యేర్పరచుకొని ఒకనిమిషంలో కిందపడుతుంది. గుడ్డులోనే పిల్ల తయారై ఒక్కసారిగా బయటికి పూర్ణ స్వరూపంతో వస్తుంది. యిన్నీ ఛూ ఛూ మహంకాళీ అని గారడీచేస్తే కలగలేదు. కానీ మనకు కనబడకనే ఒక స్వరూపంవచ్చి తేటాలున మనకండ్లకు కనబడేటప్పటికి ఒక స్వరూపం వస్తుంది.

అట్లే సంఘంలోనే ఇప్పుడున్న విధానం లోని పరస్పర విరుద్ధస్థితిలోనే, యీసమాజవిధాన మంతా శిధిలమైపోయి విచ్ఛిన్నమై పోతూంటే దీనిచాటునే దీనిగర్భంలోనే మరో నిర్మాణం తయారవుతూంటుంది. అది ఒక్కసారి బయలు పడుతుంది. అంతే కానీ, అసలే అంతకు ముందేమీలేకనే ఆనాడురాదు. కాని ప్రకృతి పరిణామమే కాదు. పరోక్షంగా తయారై ఒక్కటే సారి మనకు కనబడేదాన్నే విప్లవమంటారు. రష్యాలో విప్లవం పదినాళ్ళల్లోనే పుట్టలేదది.

మెన్నోయేండ్లు జారు వ్రిభువుల దుండగాల ఫలితంగా నలిగిపోయిన బీదల హృదయవేదనా ఫలితంగా ఆనాడు వెలువడింది.

దేశ మిందుకు తయారయిందా? అంటే ఆభారం మనదే. అందుకు తయారు చేయాలి. యెప్పటికీ 'జనం తయారయినారా' అని ఓటుకు పెట్టితే ఒవ్వుకోరు. సత్యాగ్రహము చేస్తామా వద్దా అని 1930 లో ఓటు తీసుకొనివుంటే సత్యాగ్రహం రానేరాదు. అంతెందుకు సహాగమనం తీసేస్తామంటే వద్దన్నారు. విధవా వివాహాలు చేస్తామంటేగుర్రుమన్నారు. బాల్యవివాహాలుకూడ దంటే తూరుపెత్తారు. కల్లుతాగొద్దంటే గంటు బోయినట్టు కొట్టుకొన్నారు. ఇట్లాఉంటే యెంత మంది తయారయినారు అనరాదు. అట్లా నం ఘాన్ని తయారుచేసి మనకు మంచిదని తోచిన సమాజవిధానాన్ని యేర్పఱచడానికి ఆత్మార్పణం చేయక తప్పదు. సత్యమూ, అహింసా యెంత మందికి అర్థమయింది? అట్లని మహాత్ముడు వానిని వదలిపెట్టాడా? అట్లే పరపీడన తొలగిపొయ్యేవరకు పాటుపడి అట్టి పరపీడనకు తావిని సమాజాన్ని నిర్మించాలనుకొనేవారు పాటుపడాలి. పడతారు. మొదలు త్యాగంచేస్తే యీ మాత్రం వచ్చింది. ఇంకామొందటో చేస్తేకాని ఆస్థితిరాదు.

ఇంక రష్యాదేశ విధానం తొలుతనే చెప్పి నాను. ఆసోషలిస్టు మూలసూత్రిలపై నిర్మిత మైన సమాజంతప్ప వరపీడన లేకుండా ఉండలేదు. కాబట్టి అట్టి సమాజనిర్మాణంకోనం ఆశించడంలో తప్పులేదు.

ఇందుకోనం అనేక సంఘాలు అవసరము. కేవలం యివి జాతీయోద్యమానికి దోహదంచేస్తూ మన భావికార్యక్రిమాన్ని చక్కగా ఆలోచించు కోవడానికై యెంతో అవసరం. యేవిధానమైనా చర్చించి తేల్చుకుంటేనే చక్కగా ఉండేది.

జాతీయోద్యమంలో పూర్తిగా పాల్గొని సంఘనిర్మాణంలో చేయిజేసుకొనేటట్టు యువకు లను చేయడం; అందులోనే యేసిద్ధాంతవిజ్ఞా నములేక వ్యక్తిగత విద్వేషాలకు కారణమై పోతున్న రంగాన్ని స్పష్టమైన రాజకీయసిద్ధాంత విజ్ఞానయుతంగా చేయడం; యువకుల శక్తికొక నిర్మాణాన్ని, వారిభావాల కొకస్వరూపాన్ని యిచ్చి యీశక్తినంతా వచ్చే మన అంతిమపోరాటానికి ఉపయోగపడేట్టు చేయడం; జనసామాన్యంలో చైతన్యము కలిగించడం; ఇటువంటివాని కోసం కాంగ్రెసు సంఘాని కొకశాఖగా యువజనసంఘ ములు ప్రారంభింపబడినవి. యెప్పుడూ యివి కాంగ్రెసుకు విరుద్ధంకావు.

# సమాధానాలు

## III

ఎదుటివారు చెప్పేదేమో వారి సిద్ధాంతాలేవో తెలియకుండానే తామే ఒక వాదాన్ని వారిదిగా భావించుకొని ఆపునాదిపైన పెద్దమేడను కట్టి నగిషీచేసి చూడండి తడాఖా అనుకోవడం సరైనపద్ధతికాదు.

ఏవాదాన్నయినా శాస్త్రకూస్త్రో సద్భావంతో సరిగా తెలుసుకొని చేతనైనంత ఓపికతో జిజ్ఞాసతో చూస్తే తప్ప సత్యం గోచరించదు. వీలైతే ఆవాదం సరిపోకపోతే వారివాదాన్నే ఉన్నదున్నట్టు చెప్పి దాన్నిఖండించడం సహృదయలక్షణంకాని తామే వారివాదాన్నికూడా సృష్టించడం మరీమంచిదికాదు. అది వున్న రచనాశక్తిని దురుపయోగం చేయడమే అవుతుంది. కొందరు వ్యక్తులు సరిపోకపోతే వారి సంబంధమైనదంతా తప్పే అనే నిర్ధారణతో మొదలుపెట్టడంకూడా ఇంతే.

ఒక ఉద్యమం చెడ్డదో మంచిదో నిర్ణయించవలసివస్తే ఆఉద్యమానికి సంబంధించిన 'అఫిషి

యల్ ఆర్గనైజేషన్ మూలసూత్రాలతోనో వారి నియమావళినిబట్టో, వారి తీర్మానాలనుబట్టో ఆ సందర్భాల్లో వారుచేసిన ఉపన్యాసాలనుబట్టో, నా రనుసరిస్తూన్న విధానాలతోనో ఆఉద్యమ స్వరూప మిదని నిర్ణయించుకోవాలి. అంతేకాని కోరా తోండమూ లేని కలగూరగంపగా భావించి అన్ని టిలోని తప్పులు అందులోనే ఉన్నాయనుకోరాదు.

ఈమధ్య యువజనసంఘాన్నిగూర్చిన ఆందోళన బలమైపోతూవుంది. అదేదో యెవరూ అర్థం చేసుకోవడానికి ప్రయత్నించడం లేదు. కానీ తప్పులుపట్టడానికేమో తయారు.

అదే సోషలిస్టు సంఘ మనుకొన్నారు. అది కమ్యూనిస్టుసంఘ మనుకున్నారు. అది టెరరిస్టు సంఘమూ అనకోబోతున్నారేమో. అది కుల తత్వవాదులమూతా అనే అంటూన్నారు అక్కడా యిక్కడా. అది నాయకులనబడేవారిని దించి తత్స్థానే యింకొకరిని నిలబెట్టడానికైన ప్రయత్నమూ అన్నారు. ఒకటేమిటి అన్నీ అన్నారు. అంటున్నారు, అనబోతారు.

పోనీ ఆ సోషలిజమో, కమ్యూనిజమో, ఆ టెరరిజమో ఉన్నదున్నట్టు తెలిసికొని వానిని తప్పుబట్టుకోరాదూ? చేతనైతే ఆయావాదాలు

మంచివనుకోనేవారు తమ సిద్ధాంత తత్త్వాన్ని వెల్లడిచేసుకుంటారు; లేకుంటే లేదు. — ప్రపంచం లోని సిద్ధాంతాలన్నీ యీ యువజన సంఘాల్లోనే ఉన్నాయనుకొని కడకా సిద్ధాంతాలనుకూడా మిస్ రె(ప్రజెంటు చేయడం మంచిదికాదు.

విచ్ఛిన్నమైపోతూన్న విభిన్నశక్తు లన్నింటినీ ఒకచో చేర్చి విజ్ఞానంలో వుద్యమాన్ని మేళవించి యువకులలోని విద్యుత్తున కొక స్వరూపాన్ని నిర్మాణాన్నీ ప్రసాదించి వానినొక నక్రమమయిన మార్గంలో మన దాస్య దారిద్ర్య విచ్ఛేదనా ప్రయత్నంలో బాగా ఉపయోగపడేటట్లు చేసు కోవడానికే యిదంతా.

బొత్తిగా రాజకీయార్థిక విజ్ఞానం లేకనూ పరస్పర భావ సమీకరణం లేకనూ ఉత్తుత్త తీవ్రతతో వున్న శక్తిని దివ్యంగా చేయడానికే యే సంఘమైనా. ఇవి విభేదాన్ని కలిగించడం కోసంకాదు. కాంగ్రెసు గాంధి పద్ధతినే యెక్కువగా అనుసరిస్తున్నా మరి 'గాంధీ సేవాసంఘ' మెందుకు? గ్రామసేవాసంఘా లెందుకు? హరిజన సేవా సంఘ మెందుకు? యెన్నో సంఘాలు అల్లే అవసరము. అవి వొక భాగముగానుండి మానవ విజ్ఞాన వికాసముల కెంతో దోహదం చేస్తూన్నవి.

ఒకొక శాఖవారి తత్వాన్ని వ్యక్తంచేసి జాతీయ నమరానికి స్వరూపాన్నిస్తున్నవి.

ఇన్ని శాఖ లెందుకు? అనేదానికి యెన్నిసార్లో బదులుచెప్పినాము. ఈ సంఘాలన్నీ ఉండవచ్చు నని స్పష్టముగా కాంగ్రెసుమహాసభ సింహాసనం మీదనుంచీ జవాహార్ హామీ యిచ్చినాడు. ఈ నాటివరకూ యీసంఘా లేవీ ఉండగూడదని యేఆలిండియా కాంగ్రెసుకమిటీ తీర్మానమూ లేదు. అంతే కాదు. అటువంటిసంఘా లుండవలసినదే నని తద్వారా రాజకీయ చైతన్యం కలిగించవలసి నదేనని బాధ్యతగల నాయకు లెందరో అంటు న్నారు. ఆచార్య నరేంద్రదేవుగారు— అఖిల భారత కృషికసంఘాధ్యక్షులు— జయప్రకాశ్— అఖిలభారత సోషలిష్టుపార్టీ ప్రధాన కార్యదర్శి—. ఇట్లే ఎంతమందో అఖిలభారత కాంగ్రెసు కార్య వర్గంలో ఉండినవారే ఈదినానికీ ఆయాసంఘాలలో ఉన్నారు.

ఇంక హింసతో స్వరాజ్యాన్ని సంపాదిస్తాము అని యెక్కడా వారి ప్రొసీడింగ్సులోనే కాదు మా హృదయాల్లోనూ కనిపించదు. సోషలిజం కమ్యూనిజంను గురించి అంటారు. వానిని వ్యక్తి గతంగా మాసంఘంలో చాలామంది స్పష్టంగా

వల్లిక్కగా చెబుతున్నాము. అవితప్పు ప్రపంచదరిద్ర విచ్ఛిత్తికి మార్గాలు లేవంటున్నాము. కానీ యివి హింసా విధానముతో స్వరాజ్యం రావాలనేవి కావు. టెర్రరిజం అనేదానికీ సోషలిజం కమ్యూనిజం అనేదానికీ బొత్తిగా సంబంధంలేదు. వ్యక్తులను చంపితే స్వరాజ్యం వస్తుందనే పద్ధతి టెర్రరిజం. అది తప్పని ప్రతిచోటా చెబుతున్నాము యేశాస్త్రీయ సామ్యవాదీ (Scientific Socialist) టెర్రరిస్టు కాడు. సోషలిస్టు భావాలూ విధానమూ ఆలిండియా సోషలిస్టుపార్టీ కాన్స్టిట్యూషనూ తీర్మానాలూ 'సోషలిజం యెందుకు?' అనే జయప్రకాశ్ పుస్తకమూ చదివితే తెలుస్తుంది. సోషలిజంమంచిదా? అనుసరణీయమూ కాదా? అని వ్యక్తిగతంగా చర్చిస్తాము. వ్యక్తిగతంగా కాంగ్రెసు అధ్యక్షులే సోషలిజం భవతారక మన్నారు.

యేవిషయంగాని విమర్శించే టప్పుడు దాని సంగతే వ్రాయాలి.

ఆధారం లేకనే వర్కింగుకమిటీపైన ఆరోపణలు చేసినారని బోసును దుమ్మారబట్టారుకదా ! అట్లే అన్ని సంఘాలను విమర్శించేటప్పుడూ చక్కగా ఆధారాలతో, అవి భావించుకొన్నవి ఊహించుకొన్నవీ కాక, అఫిషియల్ గా ఉన్న ఆధారాలతో చర్చించడం మంచిది.

ఒకరి సద్భావాన్ని అనవసరంగా శంకించడ మెందుకు? మాకు మాత్రం ఆవేదన లేకపోతే ఇదంతా యెందుకు చేస్తాము. మేమూ కాంగ్రెసు నాయకులమునే అనుకోలేమా? మురిసిపోలేమా? కానీ లాభము లేదు.

మొన్న కాంగ్రెసు మహాసభలో 'నేషనల్ డిమాండు' జాతీయ మహాసంకల్ప 'తీర్మానం ఆమోదించబడిందే, అదెందరికి తెలుసు ఆ పనే మేము చేసుకుంటాము.

పరిశుద్ధ హృదయంతో, సంఘస్థితినిచూచి ఆవేదనతో, దరిద్ర నారాయణులమీది ప్రేమతో ఉడుతకు ఉడుతాభక్తిగా, చేయబూనుకొన్నాము. ఆశ అనవసరం. అకల్మషహృదయాలను వణికింపజేస్తూన్న యీ ఘోరదరిద్రాగ్ని జ్వాలలు మా కన్నీళ్ళతోనే ఆరిపోవూ! ఆరిపోవూ!

ఏదో మాచేతనైనంత మేమూ చేస్తాము. లేదా చేయడానికి ప్రయత్నిస్తాము. అదీ కాకపోతే చేయవలెనని సంకల్పించుకుంటాము.

ఈ సద్భావమే మాకుండుగాక. అట్లే మేము పనిచేయుదుముగాక. ఒకరివిమర్శనలతో పనిలేదు. ఎవరి తత్త్వం దానికదే బయల్పడుతుంది.

---

# నీ తు లు

ప్రతివారూ పలకరిస్తే పదినీతులు చెబుతారు. ఏ ముసలాణ్ణి నడిగినా, ఏ పిల్లతల్లి మాట్లాడినా, ఏదో దానికి నీతు లేకరువుపెట్టడం మామూలుగా మనం వింటూంటాము.

అందులోనూ కొన్ని వారివారి మతాలకూ వర్గాలకూ సంబంధించిన నీతులను కొందఱికి కొందఱు ఒప్పుకోకపోయినా ప్రతివారూ ఒప్పుకొనే కొన్ని నీతులున్నాయి. అవిమాత్రం అవిచ్ఛిన్నంగా వాడుతూంటారు.

ఎవరినీ బాధించరాదు! ఒకరిసొత్తు ఆక్రమించుకోరాదు. అబద్ధమాడరాదు. వ్యభిచారం చేయరాదు, దొంగతనం కూడదు.

అబ్బ, బోలెడన్ని ఉన్నాయి. ఇవన్నిటినీ ఏ దొమ్మగలవాడూ కాదనలేడు. పైగా తనకు వచ్చిన భాషనంతా ఉపయోగించి వీనిని వివరించి ఆ గుణాలున్నవారిని చెడదిడతాడు.

ఏపుస్తకం చూచినా ఏశతకం తీసినా ఏ

కథ చదివినా పలుకుపలుకినా యీ నీతివాక్యాలు పొడసూపుతూంటాయి.

యెన్నడో యేనాడో యేర్పడిన వేదాలు మొదలుకొని యీ నీతి ప్రశంస ఉండనేఉంది, అప్పుడప్పుడు శాస్త్రమార్పులు కలుగుతున్నా.

కానీ అసలివి యెందుకు పుట్టినాయో ఆవనిమాత్రం నెఱవేటించాలంటే తలగీరుకోవలసి వస్తుంది.

సమాజానికి వ్యక్తికీ ఉన్న సంబంధాన్ని చక్కగా ఒడుదుడుకులు లేకుండా జరిగేటట్టు చేయడంకోసం కొన్ని నీతినియమాలు అత్యవసరములైనవి.

వాటిని రక్షించడం కోసమే అనేక రాజ్యాంగాలుకూడా యేర్పడినవి. యెన్నో మతాలు తలసూపినవి. యెన్నో తత్త్వశాస్త్రాలు బయలు దేరినవి.

అవేమో ఆయా కాలాలలో ఉన్న సమాజస్థితి కనుగుణంగా, సమరసతను చేకూర్చేటందుకై కొంతకుకొంత ఉపయోగపడినవనే చెప్పొచ్చు. కానీ పూర్తిగా నెఱవేఱలేదు ఉద్దేశం.

మనిషి, సామాన్యంగా ఒక పరిజాభిప్రాయమేదైనా యేర్పడిందంటే దానికి బహిరంగంగా

యెదురుచెప్పడానికి జడుస్తాడు. అందుకే తానూ ఆపాటే పాడడం మొదలుపెడతాడు.

అందుకే, ఆనాడుబలసికొన్న ప్రజాభిప్రాయ ప్రకారం ఆనీతులు చాలా మంచివనేమో చెబుతాడుగానీ, వాని నాచరణలో పెట్టడానికి మాత్రం అంతగా ప్రయత్నించడు.

అహింసకోసం అంత బ్రహ్మాండ ప్రయత్నం చేసినాడు బుద్ధుడు. యేమయింది? అహింసా పరమో ధర్మః అనడాని కెవ్వరూ అడ్డుచెప్ప లేదు. కానీ ఆచరించినవారో!

ఒకరి నేమాత్రమూ బాధించరాదన్నాడాయన. కేవలం ఆకాలంలో బ్రాహ్మణమతం చాటున జరుగుతున్న పశుహింసలనూ, రాజులూ ధనికులూ బీదవాళ్ళ నేడ్పించడాన్నీ పురస్కరించుకొని అవంతా అన్యాయమనీ, యీ ప్రపంచం దుఃఖమయం దీనికోనం యెందుకిట్లా పలవరించడమనీ అన్నాడాయన. దేవుడున్నాడో లేడో అదిగాదు సంగతి, మనఃపరిశుద్ధతను ప్రతిపాదించే మంచిగుణాలు అలవఱచుకోవాలన్నాడు.

మహాపాతకాల కాకరమైన మార్గాన్ని - కామాన్ని - జయించమన్నాడు. అందుకు కోలెడు గ్రంథాలు చెప్పినాడు.

ఆయనబోధ నెంతవుందో అంగీకరించి నారు, కానీ ఆ ప్రముఖశిష్యకోటి కడకాయన సిద్ధాంతాల నేవిధంగా ఆచరణలో పెట్టినారు?

ఆయన చనిపోతూనే దంతాలకూ యేము కలకూ యుద్ధాలు చేసినారు. రక్తాన్ని పారించినారు.

హింస అంటే యెవని ప్రతి రక్తకణమూ ప్రతిఘటిస్తుందో అతని శరీరంలోని అవయవాల కోసం, అతని సిద్ధాంతాలను ప్రపంచములో ప్రబలించి పరమ స్వర్గా న్ననుభవించగలమనే వరమూ దర్పంతో పనిచేసే అతని శిష్యులు, చేసిందేమిటి? హింసా మహాయజ్ఞం.

ఇట్లాగే ప్రతిసిద్ధాంతమూ, ఆచరణా, చాలా భేదాన్ని పొందుతూ వచ్చింది.

యీనాటికీ యేమగాడూ పైకి హింస వ్యభిచారం మొదలైనవానిని మంచివని చెప్ప లేదు. కానీ వానినే అనుక్షణమూ అంతో యింతో ఆచరిస్తూనే ఉంటాడు.

అంతెందుకూ, ఆచారం చెప్పిన చిన్నపెద్ద ఆకూటికే లోబడినా డంటారు. అట్లా ప్రతి ధర్మమూ కేవలం మాటల్లో ఉన్నన్నాళ్ళూ యే మాత్రమూ పనిచేయలేదు.

కేవలం ఆదర్శంగా మనం యెన్ని విష యాలనో అంగీకరించవచ్చు. కానీ వాని నట్లా అంగీకరించడంవల్ల వచ్చిన ప్రయోజనమేమిటి?

అందరూ ఒకరిని బాధించడం తప్పంటారు. అందరూ బాధిస్తారు. యెందుకు ?

ఇంతకూ యిందులో యేదో రహస్యముంది. లేకపోతే అంత అన్యాయంగా యెందుకు ప్రవర్తిస్తారు, చెప్పేచేతలకు సంబంధంలేకుండా? యీ నీతినియమాలుకూడా అవే ఆదర్శాలు కావు. మరి అవి సాధనాలు. సమాజానికీ వ్యక్తికి సామరస్యాన్ని కల్గించేవి.

కానీ యివన్నీ ఆచరణలో పెట్టడానికి తగిన సమాజ నిర్మాణం లేకపోవడమే దీనికి కారణం కావచ్చు.

దేనికైనా పరిసరపరిస్థితులు అనుగుణంగా లేకపోతే ప్రయోజనమేముంది?

ఇప్పుడు మనం పరపీడన మంచిది కాదు అంటే నిజం అనేవాళ్ళను లెక్కలేనంత మందిని పురమాయించుకో వచ్చు. కానీ, పాపం, వారు తెలిసో తెలియకో పీడిస్తూనే ఉంటారు పరులను.

ఒక భూస్వామే ఉన్నాడు. అతనికి మన
సులో యేమూలనైనా కూలివాని నోరుగొట్టా
లని యిష్టం లేకపోవచ్చు.

కానీ మన సమాజవిధానమే అతని క్రియ
నితడు దోచుకొనేటట్టు చేసిపెట్టింది. యేం
చేయగలడు?

ఆర్థిక నిర్మాణం యంత్రప్రాయమైనది. యీ
అస్థిరమైన స్వేచ్ఛా వ్యాపారం మూలాన, ఒకనికీ
'సెక్యూరిటీ' అనేదే ఉండదు. అందువల్ల తత్ఫలి
తంగా పోటీలూ దివాలాలూ పీడనలూ, ధన కేంద్రీ
కరణమూ, ఒకటేమిటి వీటిద్వారా మహాభయంకర
యుద్ధాలూ, దేశస్వతంత్ర భంగాలూ కలుగు
తూంటాయి.

ప్రతివాడూ ధర్మం పలికేవాడే కానీ
ప్రపంచమే మహా భయంకరంగా మారి
పోతుంది.

కేవలం మనము మారితే ప్రయోజనంలేదు.
అసలది మారదు పరిస్థితులు మారనిది. భావ
వాదు లెన్నాళ్ళు కొట్టుకొంటూ నేడున్నా ప్రపంచం
యేమాత్రం శాంతంగా జరగడంలేదు.

అందుకే శాస్త్రదీర్ఘంగా ఆలోచిస్తే, యే
నీతినియమాలు సరిగా ఆచరణసాధ్యాలు కావా

లన్నా, సంఘనిర్మాణంలో మార్పుజరగవలెను. ఆచరణలేనిసిద్ధాంతా లనవసరాలు. ఆడంబరాలు.

షావుకారి కేవలం ఆస్తికి ధర్మకర్త అను కోవాలనడం చాలాబాగుంది. కానీ, అనుకుం టాడా? అసలనుకోవడానికి వీలున్నదా?

అందుకే వర్గాలుఅనే భేదమున్నన్నినాళ్ళు యివి సరీగా నడపుకోవడం కష్టం.

ఊరికే లేవంటే కుదరదు. ఒకరిని పీడించ డాని కనువయ్యే భౌతికవాతావరణం లేకపోతే ఆతర్వాత మానసికంగాకూడా ఆవ్యక్తిలో పరపీడ నేచ్ఛ వశిస్తుంది. ఒక్కతూరే పోకపోవచ్చు. కానీ ఆకొత్త వాతావరణం కొన్నాళ్ళల్లో అతని మానసిక ప్రపంచంలోనూ యీ దుర్గుణాలను తుడిచివేస్తుంది.

మన ధర్మప్రవర్తకత్వం చక్కబడటాని కీ ఉపాయంతప్ప మఱివేఱేలేదు.

ఆదర్శాలలో నెవ్వరూ తీసిపోరు. ఆచరణ లోనే అందరూ జోల్తాపడేది. అహింస మంచిదని ప్రతివాడూ అంటాడు కానీ ప్రతిదినమూ యెంత మందిని హింసిస్తున్నారు?

శాంతిస్థాపనకోసం పరరాజ్యాలను గుంజు కుంటారు. న్యాయపరిపాలనకోసం స్వతంత్రి

మిస్తారు. దుర్బలరక్షణకోసం సామ్రాజ్య వ్యాపనం చేస్తారు.

ఏమిటో యీ పరస్పర వైరుధ్య ప్రవంచమే యీవిధంగా తేలిపోతూంది. పీడితులూ పీడకులూ అనే భేదం ఉన్నంతవరకూ యింతే. యిందుకే ఆ వర్గరహితమైన సమాజం యేర్పడింతరువాత సులభంగా పై నీతినియమాలను కేవలం ఆదర్శం గా కాక ఆచరణలో ఉండేటట్టు చేయవచ్చు.

లేదంటూరా ?

మీరు చెప్పే ధర్మాలన్నీ ఆచరించండి. అందుకై ప్రయత్నించండి. యెక్కడికి లేవా అవన్నీ; యేదో మహాత్ముల కవి సాధ్యమవుతాయి కానీ మనకెక్కడలే; అంటే కుదరదు.

మహాత్ముల కోసం కాదు నీతులు. మన వంటివారి కోసమే. మానవసమాశాంతికోసమే. మాటలకు కాదు.

---

# ఆనందం

ఎన్నాళ్ళనుంచో యెడతెగకుండా ఆలోచిస్తున్నా యేమీ అర్థంగా దీజీవితం సంగతి. ఇదో సమస్య. విప్పేవాడెవడు ? వినేవాడే కానీ.

ప్రపంచాలో అనేకరకాలైన జీవితాలున్నాయి. ఒకటి ఉత్తరం అంటే ఇంకోటి దక్షిణం అంటుంది. ఒకదానికోదానికి సంబంధంలేదు.

"మా కాలంలో జీవితం యెంత ఆనందమయంగా ఉండేదనుకున్నావు" అని పెద్దవాళ్ళంటూండగా వింటున్నారు. కానీ ఆనందం అంటే యేమిటో వాళ్ళవాళ్ళ అనుభూతినిబట్టీ అనుభవనశక్తినిబట్టీ ఉంటుంది.

ఒకడు ఏకాంత జీవితంలో యేవేవో ఊహించుకొని అతీతమైన అవాఙ్మానసగోచరమైన ఆనందాన్ని ఆమాంతంగా అందుకోగల్గుతాడు. ఇంకొకనికి పలువురిలో పడితేగానీ ప్రాణం నిలవదు. ఒంటరితనం అంటే వాణికిపోతాడు.

సావాసులలో సరసాలాడుతూ అందులోని అనూన సౌందర్యాన్ని అనుభవించగల డీవడు.

ఇట్లా ఉన్నప్పుడు యేది ఆనందప్రాయమైనదో యేదికాదో కూడా చెప్పలేము.

లేకపోతే షావుకార్లు మహానంద పడడానికి వీలున్నదందామా అంటే అంతకన్నా ఆరాటపడే వాళ్ళు బీదల్లోనే తక్కువేమో అనిపిస్తుంది. అంతా కూడితీసివేతల్లో ఉంటుంది అతగాడి ఆనందం. అంకెలలోపడి అల్లాడిపోయే అతనికి అదే జీవితాదర్శం

ముంతెడు గింజలకు కూలికిపోయి పగలెల్లా పాటుపడి కడకు రెడ్డిసాని రెండుసేర్లని ఒకటిన్నర సేరు కూలివేస్తే ఒళ్ళోవేసుకొని గంజో అంబలో తాగే పనికత్తె చూడండి.

పండు వెన్నెల పుడుతూనే షావుకార్ల మేడలకే వెళ్లవేసినా, తరువాతనైనా గుడిసెల మీదా తన మిగిలిన సుధను చంద్రుడు విదిలించినాడు.

అమాయికంగా 'చందమామ రావే' అంటే 'నూటొక్కపూవు' అని బీదపిల్లలు మన్నంతా మాదే అని మురిసిపోతున్నారు.

ఆమె తన ఒడిలోని బిడ్డకు చంద్రుణ్ణి

చూపిస్తూ ముద్దాడుతూంది. వక్కనే నడుము వాల్చిన మొగుడితో ముచ్చటలాడుతూంది.

పంచమస్వరంలో పల్లెపదాలు పాడు తూంటే అతగాణ్ణిచూచి ఆనందానందం చెందు తూంది. అనంతా తన పిల్లమీద ముద్దులు కురిపించడంలో ఉద్రేకాన్ని అణచుకొంటూంది. ఆనందమంటే అంతకన్నానా.

అది మూడంతస్తుల మేడ. మిసిమిరంగు లతో మిలమిల లాడుతూంది. అందులో గది. కావలసినన్నీ ఉన్నాయి మధుర వస్తువులు. కళ వుందో లేదో తెలీదు కాని విలాసాల కందులో కొదవలేదు. అయితే మాత్రం?

నవనవలాడే నిండుజవ్వని అంతటా తిరుగు తూంది. ఒక్కటీ ఆమెకు ఆనందాన్నివ్వడంలేదు. ఏమీ అర్థం కావడంలేదు. అన్నీ ఉన్న ఆ మేడలో అలవరిస్తూం దాలబన. ఏమి కొఱత ఉందో!

కాబట్టే, తత్త్వవేత్తలు చాలామంది ఆనం దమూ సౌఖ్యమూ వస్తువులవల్లకాక మనస్సు వల్లనే కలుగుతుంటాయి యెక్కువగా నంటూం టూరు.

అయితే, ధనిక దరిద్ర భేదాలకు ఆనంద జనకతలో అసలు పలుకుబడిలేదని చెప్పడంలేదు.

కావలసినంత కార్యకలాపం జరుపుతూందా భేదం. కానీ, అందులోనూ ఆనందాన్ని అనుభవించే శక్తి కొందరికి ఉంటుందనే నా వాదం.

అందుకే ఆనందైక జీవితం కావాలనంటే వసతులు కల్పించుకోవడంలోనే కాక మనోనియమంలోనూ, పరిస్థితులను, ప్రతి చిన్న సంఘటననూ శాస్త్రీయంగా సూక్ష్మపరిశీలన - అనలైజ్-చెయ్యడంతోనూ, సులభంగా అలవరచుకోవచ్చు.

ఎందుకిట్లా కావాలి అని ఆలోచించి దానికి సరియైన కారణం కనుక్కున్నప్పుడు చిల్లర చిల్లర వ్యక్తిగత విభేదాలకు లోబడని ఒక వివేచనాశక్తి కలుగుతుంది. అందువల్ల ఆరాటం తక్కువౌతుంది. అందుకే అందరూ వేదాంతులు (Philosophers) విచారణచెయ్యమంటారు.

అసలు సంగతేమిటంటే: జీవితసుందరోద్యానాన్ని వెలిగింపజేసే గులాబివంటిదీ ఆనందం. ప్రతి వారూ దానికోసమే తంటాలు పడుతూంటారు. కానీ, అందుకోలేకుండా ఉన్నారు. దీనికి వసతులున్నంతలోనే కాక వాటిని అనుభవించే సామర్థ్యం కావాలి. అందుకు మనోనియమమూ, వివేచనాశక్తి విశాలహృదయూతా అవసరం. ఆ ఆనందమే జీవితాదర్శం.

ఆ ఆనందం కోసమే యింత విజ్ఞానమూ. యీ సంసారమూ. అది కావాలనే - అన్నీ మిథ్య అనే అద్వైతి మొదలూ అంతా నాకోసమే అనే వానివఱకూ - ప్రయత్నిస్తూండడం.

ఆనందంలేని జీవితం అంధప్రాయం. నరకం మేలు అంతకన్నా.

ఇంకో కొత్తసిద్ధాంతం, ఏడుపులోనూ ఆనంద మున్నదని. అదెంత నిజమో చెప్పేటంత సాహసం లేకపోయినా అసలానందమే ఉంటే అది యేడుపే కాదుగదూ.

ప్రతిమనిషీ పరిపూర్తిగా ప్రపంచాన్ని తా నుపయోగించుకోవాలన్నా తాను ప్రపం చానికి ఉపయోగపడవలెనన్నా, యీఆనందాన్ని అలవఱచుకోవాలి. అందులో తేలిపోతూండాలి. దినాని కయిదునిమిషాలు అన్నిటినీ మఱచిపోయి ఆనందంగా ఉంటే అంతకన్నా మందులేదు.

అది మనకందరికీ కలిగితే—కలగడమేమిటి —మనమందఱమూ అలవరచుకోగలిగితే, అంత కన్నానా. ఆనందో బ్రహ్మ.

కానీ నామనసేమో ఆవేదనే పడుతూంది గానీ ఆనందించడంలేదు. ఎందుకో ?

---

# ఎందుకు?

నాకేమీ తోచడం లేదంటే నమ్మరుగానీ యేచిన్నముక్కా సరిగా ఆలోచించుకొన్నామంటే అంత తొందరగా నిర్ధారణ చెయ్యలేము.

ఏమిటిదంతా? యీ ఘోరాలేమిటి? యీ నీచత్వం యేమిటి? అని అడిగితే అందునుగూర్చి ఆందోళన చెందితే, నన్ను వెఱ్ఱివాడనుకొంటారు గానీ మీరొక్కమారు సమాజంలోని దినసంఘటనలను పరికిస్తే తప్పక గుండెలు నిల్చిపోవూ?

ఎంత బాధపడుతున్నారో? యెందఱు బాధ పడుతున్నారో? యెందుకు బాధ పడుతున్నారో? యెవరు విచారించేవారు?

... ... ...

అదో అక్కడో ముసలామె చూడండి పాపం ఆమెకు దిక్కూదివానమూ ఉన్నదల్లా ఆమనమడు మాత్రమే. ఆమె శరీరం వంగిపోయింది. యెన్నికష్టాలను మోసుకొనితిరిగిందో!

కొడుకూ కోడలూ మొన్న వచ్చిన గత్తరలో కాలంచేసినారు. కాటకంలోనే కడుపు

మాద్చుకొని గతించినా డామె మొగుడు, అంతకు పూర్వమే.

ఇప్పుడామె కొడుకుడికి మలేరియా జ్వరం అంటుకొంది. అది పాల్మాళ్ళ జ్వరంగా తిరిగింది. చిక్కి శల్యమై పోయినాడు. అతనికి మందో మాకో యివ్వడానికి యిప్పించడానికి యేముంది? పక్కింటి వెంకమ్మతో పరసాకు కట్టించింది. అంతే.

అతని దగ్గరే కూచొని కంట తడిపెట్టుకుంటూంది. ఆఁ. ఆఁ. అంతతోనే ఆపాపోడట్లా ఆపసోపాలు పడుతున్నాడెందుకు? దప్పి దప్పి అని వాపోతూన్నాడు. భరించుకో లేకున్నాడు తాపానికి. "అవ్వా!" అనేమో చెప్పబోయి నాడే కాని గొంతెగయలేదు. కఫము చుట్టు కొంటూంది.

'పాపోడా పాపోడా' అంటూ పలవరిస్తూనే పాలెడితో మందు నూరిపోసింది. ఒక్కసారి కనులు విప్పిచూచి కన్నీళ్ళువిడిచి కన్నుమూసినా డాపసికూన. నూనెలేక గబ్బునూనెబుడ్డీ గప్పు మని ఆరిపోయింది. ఆ మొక్కడికి పోవాలి? యెవరిని రమ్మనాలి? దీపంలేని యింట్లో కొఱ కొఱ మంటూన్న కూనను విడిచి పోవడానికి కాళ్ళొస్తాయా?

ఆమునలవ్వ కడుపులో కాలుతూన్న సంకటాన్ని గూర్చి యెవరాలోచిస్తారు? ఆమెచేతిలోనే కొంతడబ్బుంటే? ............ ఎందుకూ యీ ఆలోచనంతా అంటావు కదూ మీరు అవును మీకెందుకూ యీనంగతంతా?

... ... ...

అదో ఆ రైతు చూడు. యెందుకో అంత తొందరగా పోతున్నాడు. అదో అతని వర్కనే అమీనా వున్నాడు. అతనేమో అంబలిలేక అల్లాడుతూ అప్పుచేసి రెండు బడెను పోతులను తెచ్చుకొని - కణేకల్లెనుపోతులు కొండానికి డబ్బు లేదు - కట్టుగింజలకు మకిసాగినాడు. యేడ గారు పంట బొత్తిగా కాలేదు. యిరవై నాలుగ్గంటలూ కష్టపడి ఏట్లో కాల్వ తవ్వి ఆకాసంది భూమీ వరి చల్లుకొన్నాడు. ఆ వర్షింగనీళ్లల్లో పంతులెట్లా వున్నా వారూ వీరూ సవరించుకోగా వచ్చేది పదహైదునాళ్లకు.

మంచి పంటసమయంలో నీళ్ళు చాలలేదు. ఆకాస్తమడీ యెండిపోయింది. కళ్ళంలో గింజలు కొలిస్తే కట్టుగింజలకు చాలలేదు. కాళ్ళో కడుపులో పట్టుకొని పత్రింరాయించి ఆసామీని ఒప్పించుకొన్నాడు.

కానీ ఫనల్ జాస్తీ కట్టవలసి వచ్చింది. ఆ అప్పును తిప్పుకోవడానికి వీల్లేకపోయింది. అందు వల్ల అమీనా జప్తీచేయడానికి వచ్చినా డాయెను పోతులను.

అతడెక్కడికి పోతున్నాడు ? యెందుకు పోతున్నాడు ? అంటే, ఏమిటీ యీ పిచ్చి వూహా లన్నీ అంటారు కదూ ?

... ... ...

అదో, ఆ సులకమంచం మీద పండు కొన్నాడే ఆయనేదో గొణుక్కుంటున్నాడుచూడు. ఆయ నో పెద్ద భూస్వామి పూర్వం. ఆయన పేరంటే హాడల్ పదిపల్లెలకు.

ఆయనది చల్లని కడుపు. పదిమంది పిల్లలు. నలుగురు బిడ్డలకూ రంగరంగవైభవంగా పెద్ద దర్జాగల వాళ్ళకే యిచ్చి పెండ్లిచేసినాడు. పెండ్లికి నాలుగైదువేలు ఖర్చుపెట్టినాడు. కొడుకు లనూ పెద్ద పెద్ద పరీక్షలకు చదివించినాడు. అం దఱూ వుద్యోగాల్లోకి పోయినారు వాళ్ళ వాళ్ళ కొత్త పెండ్లాలతో.

కడగొట్టు కొడుకు మాత్రం కొంపలోనే ఉన్నాడు. వీనివంతు వచ్చేటప్పటికల్లా తేలింది, ఆస్తిపోనూ అప్పు అయిదువేలు. అట్లాగే

సేద్యమో నావ్యమో చేసుకొంటూ ఉన్నాడు. మిగతా వాళ్ళ భార్యలు పూర్తినాగరికులు గనుక యీ ముసలాయన శరణ్యంలేక యీ కొడుకు దగ్గరే వున్నాడు.

పొద్దున్నాయన అన్నానికి పోయినప్పుడు చిన్నకోడలు పొరుగింటి పరసమ్మతో అంటూంది గదా "అందరి కొడుకులనూ బాగా చదివించి పనుల్లోకి పంపించినాడు, మా ఆయనకేమో మన్నుబూసుకోవడం తప్ప లేదు. పైగా యీయనా మూనెత్తిన్నే పడినాడు' అనేరకంగా. అట్లే ఆకలి కాలేదని వచ్చి పడుకొని కొలుకుతుంటున్నాడు.

ఇదంతా చెబితే ఉరత కొందురా ఊళ్లో పెత్తనం? అంటారు మీరు.

... ... ...

అదో, ఆ యువకుడు తిండికిలేక వారాలు చేసికొని బజారు దీపాలదగ్గర చదువుకొని కడకు గాడ్రిజుయేటయినాడు. కన్నవస్థావడి, ప్రతి వారినీ ఆశ్రయిస్తున్నాడు. జిల్లా బోర్డు ప్రెసిడెంటింటి కెన్నిసార్లు తిరిగినాడో! యెక్కడా వుద్యోగము దొరకలేదు. రూము బాడుగకు తగాదా. హోటల్లో తగవు. చాకలిరంపు. అబ్బ! భాధ

పడలేక అదో పారిపోతున్నా డెక్కడికో? మీా రేమైనా చూస్తున్నారా?

... ... ...

అదో, ఆమె పెద్దయింటికిన స్తురాలు. చిన్న తనంలోనే మొగుడు చనిపోయినాడు. ఆస్తి కాస్తా అన్నదమ్ము లూడదన్నుకున్నా కొంతకు కొంత యీామెకూ దక్కింది.

అంతకు ముందే మొగుణికి ప్రాణస్నేహితుడుగా ఉన్నాడొకతగాడు. ఆయన కింట్లో బలే స్వతంత్రం. అంతా అతనిదే. ఇంటాయన చచ్చిపోతూనే యీామె కేమీా తెలీదు కాబట్టి ఆయనే యథాప్రకారం యజమాని.

కొంతకాలానికి చనువుబలిసి సరే ఆ అమాయకురాలైన అనాథను సనాథ చేసినాడు. ఆ ఆస్తి కాస్తా కాజేసి ఆమెను వెళ్ళగొట్టినాడు. అక్కడా యిక్కడా పడి కడకు కాపిటల్ లేక శరీరాన్నే కాపిటల్‌గా పెట్టి వ్యాపారం చేస్తూంది. మనకు తమాషా.

ఆమెకడుపులోని శోకం కదిలిస్తే తెలుస్తుంది! మెవరికి కాబట్టింది? బజార్లో కనబడితే అసహ్యించుకుంటా రంతేకదూ?

... ... ...

అదో ఆయన వ్రిథమం జైలుకు పోయి వచ్చినాడు. రాజకీయాల్లో ఉన్నదంతా ఊడ్చు కొనిపోయింది ఉద్యమంలో. దేశదేశాలు తిరిగి నాడు. వల్లెవల్లెలూ ఉపన్యసించినాడు. ఆయన ఉపన్యాసమంటే వేలకు జనం కలుస్తారు. కలం బడితే విజ్ఞానాన్ని ఒలకబోస్తాడు.

కానీ, తిండికిలేదు. రాజకీయాల్లోనూ పార్టీల్లో పార్టీలేర్పడినవి. తానందులో యిమడ లేదు. అదో ఆయన భావశిథిలాల్లో రేగే దుమారం దులుపుకుంటూ అప్పడగడానికి పోతున్నాడు. సానాసగాళ్ళు తప్పుకుంటున్నారు, కనబడకుండా.

చూస్తున్నారా? అతగాని ఖర్మం అం టారు కదూ?

... ... ...

ఆయన రచయిత; చూడు. చాటలో పడింది మొదలూ ఈదినంవరకూ దినగండంగా గడుస్తూం దతని జీవితం. బాగా రాస్తాడని అం దఱూ అంటారు. చక్కని శైలి. భావాలకు కొదవలేదు; విజ్ఞానానికి కొఅతలేదు. తత్త్వ శాస్త్రాలను తడివిచూచినాడు. ఉద్విగ్నహృద యంతో 'అపిగ్రావా రోదిత్యపిదళతి వజ్రస్య హృదయం' అన్నట్లు వ్రాస్తాడు.

కానీ అసనిరచనలు బయటికి వచ్చేమార్గం? వచ్చినవి చదివేవారు? చదివినా కొనేవారు? అట్లాయిట్లా చేసి అచ్చువేయించి అప్పు తీర్చలేక అలవరిస్తాండే అతణి అవస్థ చూడు!

"ఎచ్చట కన్నా, ఎచ్చట విన్నా, అతని ముఖమే కనిపిస్తుంది. వినిపిస్తుంది" అంటే ప్రపంచజ్ఞానం లేదని అంటారూ?

... ... ...

ఒకటేమిటి యేపక్క చూచినా యీ విషాద సంఘటనలే కనబడుతూంటే ఆవేదన కాక మతేమిటి? ఇవన్నీ చెబితే!

ఎందుకిదంతా? ఏమిటి నీకు పిచ్చి? యెంతో మంది యివన్నీ సరిజేయాలనుకున్నారు? యెందరు నిరాశచెంది నిర్వీణ్ణులై పోయినారు? నీవే మహా మేధావి ననుకున్నావా? యీ మొగోడే నేమో లోకోద్ధారం చేసేది? అంటారు మరీ పెద్దవాళ్ళు.

నిజమే నాయనా యిదంతా, యేమిచేస్తాం ప్రపంచమిది! నీవూ నేనూ యేమిచేయగలం? మహా మహావాళ్ళు మన్నుగొట్టుకొని పోయినారు. ఎంతో మంది తత్వవేత్తలు తల విదిలించుకొని అడవుల్లోకి పరుగెత్తినారో! అంటారు శాస్త్రహృదయం కల వాళ్ళు.

నేడు యిదంతా సంఘనిర్మాణంలోనూ
మానవుని స్వార్థపరత్వాన్ని పరమోచ్ఛ స్థానానికి
కొనిపోయే ధనికతత్వములోనూ ఉన్న దోషమే.
దీన్ని మార్చడానికి వీలవుతుంది అందుకు పని
చేయవలసినదే. మానవసేవే మాధవసేవ, అంటూ
ఊరడింపులతో ఉపన్యాసాలతో ఉబలాటం తగ్గిం
చడానికి ప్రయత్నిస్తారు మరికొందరు.

కానీ... కానీ.

ఇవన్నిటినీ మార్చడానికి వీలున్నది. సం
ఘాన్ని పునర్నిర్మాణం చెయ్యడానికి చేతనౌతుంది.
అని అందుకు నడుంకట్టి ప్రస్తుతసంఘాన్ని విమ
ర్శిస్తే కనుతెరపినావి వారికి. ఆసేవాపరాయ
ణులే ఆతణ్ణి ద్వేషిస్తారు. సంఘం వెలివేస్తుంది.
స్నేహితులు అవహాస్యం చేస్తారు

అయితేమాత్రం అతని ప్రయత్నం మాను
కుంటాడా? ఎన్నటికీ మానుకోడు.

ఎందరో యీ నిరాఘాటధాటితో పో
తూన్న సమాజజగన్నాథ రథంకింద నలిగిపోవలెను.
ఎందఱి రక్తంతోనో యీభూమి తడిసిపోవలెను.
ఎందఱి ఆత్మలో పిశాచాలై ప్రపంచమంతా
ప్రళయతాండవం చెయ్యవలెను. ఎందఱి ఆలు
పిల్లలో అన్నంలేక మలమల మాడిపోవలెను.
ఊఱికే మారుతుందా సంఘం?

ఆసమాజశక్తికే బలికావలెను. అందుకు సర్వ సన్నాహాలూ చేసుకొని రంగంలోనికి దుమికే తీరవలెను,

యెందుకూ? అంటే

అందుకే: అందుకే: ఆ బలికే: ఆబలికే ఆహాళికే!

హాళి హాళి! బలి బలి!

---

# ఎక్కడికి?

అదేమిటోగానీ జీవితాన్ని గూర్చి అంత సులువుగా అర్థంచేసుకోలేము. మన మేమిటి, ప్రతి విజ్ఞాని తత్త్వవేత్తా యిందును గూర్చే అనుక్షణమూ తలపోసి తలపోసి తనకు తోచిన వ్యాఖ్యానం చేస్తూ 'అనుక్తమన్యతో గ్రాహ్యం' అని వదలిపెడుతూండేవాడు.

ప్రతి శాస్త్రమూ ప్రతి వేదాంతమూ యిందు కోసమే తన శక్తినంతా ధారపోసి పెరిగి పెరిగి పోయింది. ప్రతి కావ్యమూ కథా దీన్ని వివరించడానికే ప్రయత్నించి బలిసిపోయింది.

యేదీ అర్థంగాకపోతే యీ జీవితానికే అర్థంలేదు. ఇదంతా భ్రమ పొమ్మని దిక్కు తోచక వలకడానికీ యీజీవితమే కారణమయింది.

అట్లాకాదు. యీజీవితమనేది చాలా అపూర్వమైనది. దీన్ని చక్కగా నడపుకోవడానికి ప్రయత్నించాలనే వాళ్ళూ ఉన్నారు.

అంతూ జీవితమనేది బాగావుంటే ప్రతి వాళ్ళకూ యిష్టమే. కానీ, అది శాస్త్ర గతుకు

కొట్టుతుందంటే శివశివా యీ పాడుజీవితం
యెందుకిచ్చినావురా మహానుభావా! అంటారు.

అందువల్ల జీవితం చక్కగా నడిచేటట్టు
చూచుకుంటే అప్పుడన్నీ సరిపోతా యన్నమాట.

ఆ తర్వాత అదెట్లా సుఖప్రదంగా ఉండ
గలదు అనే ప్రశ్న బయలు దేరింది. ఓయబ్బ!
లెక్కలేనన్ని మార్గాలు సూచించడం మొదలు
పెట్టినారు.

ఆ జీవితాన్ని సుఖప్రదంగా చేసుకోవ
డానికై యేర్పడిన మార్గాలే తత్త్వశాస్త్రాలూ,
రాజ్యాంగచర్చలూ, నీతినియమాలూ.

కానీ అవన్నీ ఒకేవిధంగా యెప్పటికీ
ఉంటాయని అనుకోవడానికి వీలులేదు. జీవన
విధానంలో మార్పులు జరిగేకొద్దీ మనుష్యశక్తి
విజృంభించేకొద్దీ, ప్రకృతిని మనిషివశం చేసుకొనే
కొద్దీ, అనేకవిధాలైన మార్పులు కలుగుతూ
రాక తప్పలేదు.

అందువల్ల ప్రపంచజీవనం మారేకొద్దీ
ఆ జీవిత దృక్పథాలుకూడా మారడం అనేకతత్త్వా
లుదయించడం జరుగుతున్నది.

ఇన్ని తంటాలూ తగాదాలూ ధర్మజిజ్ఞా
సలూ తత్త్వచర్చలూ, రాజ్యాంగాలూ, ఆర్థిక

నిర్మాణాలూ, ఊరేగింపులూ, ఉపన్యాసాలూ తీర్మానాలూ, సవరణలూ, సభలూ, సభ్యత్వాలూ యివన్నీ యెక్కడికి మనలను కొనిపోతున్నాయి? యేమీ దిక్కూ మొక్కూ లేకుండా దారెక్కడికి తీసుకొనిపోతే అక్కడికి పోదాములే అనుకున్నామా? లేక మనకేదైనా ఆదర్శము న్నదా? అదేది? అదెట్లా సిద్ధిస్తుంది?

ఎప్పటికీ మనిషి తన ఆదర్శము ముందు నిర్ధరించుకొని తర్వాత మార్గం నిర్ణయించుకొన వలెను గానీ యేదో ఒకదారిలో అకస్మాత్తుగా పడి అల్లే పోతూంటే వానిగతేం కావలెను? అది చెఱువులోనికే పోతుందో; బావిలోనికే పోతుందో? మనమెట్లా తెలుసుకోవడం? అంత తమాషా విషయమా యిది?

మనిషి సామాన్యంగా పాతదో క్రొవనే అనుసరిస్తాము అనుకొనేరకం కానీ అందుతో పాటు స్వార్థమూ సుఖాపేక్షా యెక్కువ. అందువల్లనే తనకేమాత్రమూ ఆలోచించకుండానే వీటిలో పడిపోతూంటాడు.

పెద్దవాళ్ళ మార్గాన్ని అనుసరించడంలో తప్పేమీ లేదు. ఆ పెద్దలందరికీ మనకన్నా బుద్ధి తక్కువనీ అనలేము; అనుకోరాదు. కానీ, ఆ కా

లానికి అప్పటి పరస్థితులనుబట్టి యేర్పాటు చేసు
కున్న వారి విధానాన్ని యితరమైన వ్యవహారాలన్నీ
మార్చుకొని కొన్ని మాత్రం "పెద్దలనుసరిస్తూన్నవి"
అని చెప్పడంలో మన కిష్టమైనవానిమీాది మమత
తెల్పుతుందిగానీ మన వృద్ధాచార పరత్వం వెల్ల
డించదు.

స్వార్థంవల్ల కాకపోతే యెన్నో మార్చు
కొన్నాము. యింటిలోని ప్రతివస్తువూ దాన్ని
మార్చే వైఖరిమొదలుకొనీ, మనమూ మన వేష
భాషలూ మొదలుకొనీ, మన ప్రవర్తనా ప్రధాన
జీవితాలూ మొదలుకొనీ, ఒకటేమిటి ప్రతిదీ మన
జీవిత దృక్పథమే పూరా మారిపోయింది. కానీ
మనకేమైనా నష్టం కలుగుతుందేమో అన్న భయ
మేర్పడిందో, తప్పకుండా యిది పెద్దల ఆచారానికి
విరుద్ధమనీ, పూర్వకాలంలో యిటువంటి పరిస్థి
తులు లేవనీ బ్రహ్మాండమైన ఆదర్శాలు కల్పించి
ఉపన్యాసాలు దంచి పారవేస్తారు.

విదేశాలవని యేవస్తువులు విడిచిపెట్టినాము
మనము ? రైళ్ళల్లో కూర్చోవడం విడిచినామా ?
కార్లల్లో ఊరేగడం మానుకున్నామా ? కాఫీలు
తాగడం వదలినామా? సారీలూ, అపాలజీలూ,
ఒకటేమిటి - ఒక్క అయిదు నిమిషాలు కాస్త

నాగరికుడని అనుకొనేవానితో మాట్లాడినామంటే కడకూరికే అతణ్ణి గమనిస్తూండినామంటే - వెయ్యి విదేశీయ విధానాలు మనకు కనబడతాయి. కడ కాలోచనలుకూడా పరకీయాలే. మాటలు చెప్ప నక్కర్లేదు. పోనీ శరీర పరిస్పందనాలుకూడా ఆరకంవే.

కానీ

ఇంకేదైనా వానికి దెబ్బతగిలితే విషయం చెప్పినామో యిదంతా విదేశీయం-పరానుకరణం-మనదేశం యెంతగొప్పది యేంకథ. అంతవిశాలమైన అభిప్రాయాలుగల ధర్మశాస్త్రాలు రాసినారే మనవాళ్ళు అంటారు.

ఈ చిన్న విషయాలేకాదు. పెద్ద విష యాలలో మాత్రం. ఈ ధనికవిధానం మన తాతలకాలమునాటిదా ? మనుస్మృతిలో చెప్పి నారా ? యీ మిల్లులూ యీ స్వేచ్ఛావ్యాపార పద్ధతీ పరపీడనా యిదంతా యిట్లా చెయ్యమని ఉపదేశించినారా ?

ధన కేంద్రీకరణమంటే పూర్వం బొత్తిగా నరిపడేదికాదు. ఒకణంతకు ఒక్కడే తాను కావ లసినవన్నీ అనుభవించడానికి వీలులేదు. ఒక్క దేవళమూ మందిరాలూ రాజగృహం తప్పితే అంత

పెద్దవి యితరులు కట్టించుకోవడానికి కూడా వీలు లేవనే స్మృతివాక్యాలున్నవి. కడకు మూడేండ్లు తన సంసారానికి ఖర్చులకూ సరిపోయినంత ఆస్తి చేకూరితే ఆతర్వాత యజ్ఞమో యాగమో చెయ్యవలెననీ అవి వీలులేకపోతే - అంటే అంత కర్తృత లేనివాళ్ళైతే - చేయించవలెననీ చెప్పినారు. అదెంత మంది వింటున్నారు?

అసలు సంగతి చూడండి. వర్ణవిభాగాన్ని చేసి చక్కగా యెవరి వృత్తి వాళ్ళనుసరించుకోవాలని ఒకడాన్నొకరు అనుసరిస్తే దేశద్రోహంగా భావించి మరణశిక్ష విధించేవారు.

అదెంతమంది అనుసరిస్తున్నారు? అనుసరించడాని కిష్టపడతారు? బ్రాహ్మణులేమో ఇతర వృత్తులలో చేరవద్దంటే వింటారా? క్షత్రియులు పాలిస్తామంటే రాజ్యమిచ్చే వాళ్ళెవరు? వైశ్యుల వాణిజ్యాలలో చేయిజేసుకోని ముల్లెకట్టుకోని వాళ్ళెవరు? శూద్రులు బ్రాహ్మణసేవచేస్తూ దాసులుగా ఉండమంటే బ్రతకనిస్తారా?

ఇరవై యేండ్లపటుకూ గురుకులావాసం చెయ్యమంటే వింటారా? వేదాధ్యయనం ప్రతి ద్విజుని కర్తవ్యమూ అంటే యెంతమంది చేస్తున్నారు? అగ్నిహోత్రాలెంతమంది ఆరాధిస్తు

న్నారు? గృహస్థధర్మాన్నెంతమంది అనుసరిస్తు న్నారు! అతిథి సత్కారాలూ అన్నదానాలూ ఆ వితరణా యెక్కడ పోయినవి? వయసుమళ్ళు తూనే వానప్రస్థం తీసుకొని వనంలోకి పోవటంటే వింటారా; మరి ఒక వగలాడికి మొగుడై వయసు వారిపక్క చూస్తే వాపోతాడు కానీ!

ఇట్లాంటివాటి కన్నిటికీ ప్రాచీన శాస్త్రాలూ, ధర్మాలూ చూడవలసిన పనిలేదు. వానిని తరచి చూడ నవసరము లేదు.

ఇదంతా చాదస్తము, ఒక పరిక అధి కారంలో ఉన్నవాళ్ళు వ్రాసుకున్న పుస్తకాల నడమూ, పోనీ మనమూ అలాగే తెలిపితిమా దూత్ బాత్ యిదంతా వరకీయజమూ ఇమిటేషనూ. మన ధర్మశాస్త్రాల్లో ఇవి చెప్పారా అనడమూ.

అట్లా పూర్తి పాతకాలంలో రకంగా పోదాం పదండి. అచ్చం అట్లాగే మరి న్యాయం పోషకాలుచేదాం గ్రామాలను అంటే అదంతా కుదరదు. పైకెవడైనా అన్నా తమ అధికారం సాగవలసిందే. వ్యాపారాలు అవిచ్ఛిన్నంగా జర గాలి. విదేశవస్తువులన్నీ కావాలి. ఇంకా వీలైతే మనుషులతో కూడా.

ఇంటా వంటా యిక్కరులవే కావాలి. ఆ డిన్నరులూ ఆటీలూ ఆఆటలూ, పాటలూ ఆబోటులూ, ఆ చోటులూ, ఆ బాటలూ, ఆ వేటలూ ఆ విహారాలూ, ఆ అసెంబ్లీలూ అకౌన్స్యిళ్ళ్యూ ఆ రూలింగులూ, ఆ ప్రొసీడింగ్సూ, ఆ పాయింట్ ఆఫ్ ఆర్డర్లూ ఆ అమెండ్మెంటులూ, ఆ ప్రెసిడెంటు శెక్రిటరీ పదవులూ అబ్బ! కాయితాలు చాలవు. ఇవన్నీ కావాలి. ఇవన్నీ పరదేశాలవికావు. కానీ, ఆ పరదేశాలనుంచీ దిగుమతే అయిన ఈ వెధవ సమాజవిధానం బాగుచెయ్యడానికీ, యీ దరిద్ర నిరుద్యోగాలను విచ్ఛిన్నముచేసి ప్రపంచంలో శాంతి సౌభాగ్యాలను కేవలం యేజన్మతః ఒక వర్గానికే చెందిన యింబ్రిహ్మాలకో కాక నలుగురికీ సంబంధించినవిగా చేయడాని కేవిధానమైనా ఆలోచిస్తామండాి అంటే, ఊహూహూ. ఇదంతా మైల—

ఏం కొట్టుకోనేది? ఇదంతా, యెక్కడికి దారితీస్తుంది? కేవలం స్వార్థంకోసమే కొన్ని విషయాలలోనైనా వీరు ప్రాచీనుల పేరైనా యెత్తడానికి యిష్టపడుతున్నారు కానీ మరింకేమీ కాదని యేకాస్తఆలోచనాశక్తి ఉన్నవాణికైనా అర్థంకావడం లేదూ?

పోనీ కొత్తగావచ్చే ఆర్థిక నిర్మాణాలలో రాజ్యాంగాలలో యేదో ఒకదాన్ని అనుసరిస్తాములే అనుకుంటే అదేదో చక్కగా నిర్ధారణ చేసుకోక పోతే యెట్లా ?

స్వరాజ్యం లేక యిలా మనదేశం కుప్రింగి పోతూంది. ఇప్పట్లో యీ సామ్రాజ్య తత్త్వం బారినుండీ మనం తప్పించుకోవడానికి సర్వశక్తు లనూ వినియోగించవలసి వున్నది. అంతవరకూ యేసంగతీ ఆలోచించడానికి వీలు లేదంటారా ?

ఆది నిజమేగానీ, అసలు స్వరాజ్యమెందు కని ? యేదో జనసామాన్యానికి శాంతి సౌభాగ్యా లను సమకూర్చడాని కనేనా ? లేకపోతే కేవలం బ్రిటీషు సామ్రాజ్యాన్ని దేశంనుండీ విడిపించడం మాత్రమేనా మనఉద్దేశ్యం ?

మనకు స్వరాజ్యం రావాలన్నా జనసామా న్యం చేయిజేసుకోనిది రాదు. వారు కలిగించుకో వాలంటే వారికి రాబొయ్యే స్వరాజ్యం అండో ఆపో అవుతుందనే విశ్వాసం ఉంటేనా; ఊరికే మన ఉపన్యాసాలకు ఉబ్బిపోయి యిందులో దిగుతారా ? స్వరాజ్యం ఉన్న దేశాలన్నీ బాగున్నాయా ?

పోనీ స్వరాజ్యం వస్తూనే "ప్రజా ప్రభు త్వాన్ని స్థాపించి 'స్వతంత్రమూ సమానత్వమూ

సహోదరత్వమూ' స్థాపిస్తామంటారా? అందు లోని రహస్యం అందఱికీ తెలిసిపోయింది. కేవలం యివి సభావేదికలమీద చక్కగా ఉపయోగిస్తే శ్రావ్యంగా వినబడడం తప్ప యే 'ప్రజాప్రభుత్వం' అనబడుతూండే రాజ్యంలోనూ పైమూడూ నామకార్థం తప్ప లేవు.

యెన్నాళ్ళనుంచో చక్కని పార్లమెంటరీ ప్రజాస్వామ్య ముండే బ్రిటీషు రాజ్యాంగమంతా యే యిన్నూరు మున్నూరు కుటుంబాల ధనిక వర్గమో కరగతం చేసుకున్నదనీ యెందఱో పేదలూ బీదలూ తిండికి లేక మలమలా మాడిపోతున్నారనీ, ఇంకా, యెట్లా అక్కడి వారందఱికీ మన దేశంలాంటి అభాగ్యదేశం 'కాలనీ'గా ఉంది గాబట్టి యీమాత్రమైనా సరిపోయింది. కానీ లేకపోతే యీపాటికి యేమైపోయేదోననీ బాగా తేలిపోయింది.

వెల్సు లాస్కీ కోలు షా, మొదలైనవాళ్ళ పుస్తకాలు చదివితే తెలుస్తుంది. కొత్తగా వచ్చిన 'ధనమూ దరిద్రమూ' అనే న్యూస్పేపులు లైబ్రరీ వారి పుస్తకంలో యెంతో బాగా యీవిషయం విశదీకరింపబడింది.

యెంత పెద్దపేరు బెట్టినా యేమిచేసినా వస్తుతః ప్రజారాజ్య మేర్పడవలెనంటే ధనిక దరిద్రవర్గ భేదమూ, యీ స్వేచ్ఛావ్యాపారమూ, పెద్ద పెద్ద ఉత్పత్తిస్థానాలపైన యీ వ్యక్తిస్వత్వమూ తొలగి స్తేతప్పా యేమాత్రమూ సాధ్యం కాదు. కానేకాదు.

పోనీ, constitutional గా వరుసగా కొన్ని కొన్ని చట్టాలుచేస్తూ మనం వీటి నన్నిటినీ సరి చేయువచ్చుగాఅంటారు మరికొందఱు.

అది సాధ్యంకాదు. యెప్పటికీ యీభేదం యిట్లనేవుండి చట్టాలుచేయువలెనంటే వీలుకాదు. యేచిన్నమార్పూ యీ ధనికవర్గం వొప్పుకోదు. ప్రతిదానికీ అడ్డంకి కల్పిస్తారు. పోనీ మీరు మెజారిటీ తెచ్చుకోండి అంటారు.

అదెట్లా? ప్రెస్సు వారిది. పేపర్లు వారివి. సినీమాలు వారివి. అధికారం వారిది. యే సంస్థ యేర్పడినా యెవరైనా వాళ్లపక్క లాక్కునే శక్తి వారికుంది. ఒకటేమిటి దినజీవితం లోని ప్రతిసంఘటననూ ప్రతి రాజ్యాంగ విధానం లోని గతినీ వారు కంట్రోల్ చేస్తూంటే యెట్లా సాధ్యమౌతుంది.

కాబట్టి, యివన్నీ పోవాలంటే జనసామా న్యంలో మెలకువకలిగి, ఒక్కసారి ఒక ఉప్పెన లాగా ఉద్యమం లేచి గొప్పవిప్లవం వస్తేతప్ప యేమాత్రమూ జనసామాన్యం సుఖసౌభాగ్యాల నందుకొనే రాజ్యం రాదు. నిజమైన ప్రజారాజ్యం, వర్గభేదంలేని ప్రజారాజ్యం, ఉత్పత్తిసాధనాలపైన వ్యక్తిస్వత్వాన్ని తొలగించేప్రజారాజ్యం, యథార్థ మైన స్వతంత్రాన్నీ సమానత్వాన్నీ సహోదరత్వా న్నీ పెంపొందించే ప్రజారాజ్యం, విరివిగా పెరిగిపో తున్న విజ్ఞానాన్ని కొందరికేకాక అందరికీ అందు బాటులో ఉండేటట్టు చేయగల ప్రజారాజ్యం, ప్రపంచ సామ్యతత్త్వం ఆదర్శంగాగలిగి అందుకు సంఘాన్ని తయారు చేయగల విద్యాశాలగా పనిచేసే రాజ్యం, మానవసమాజానికే పునా దులుగాఉన్న కర్మజీవులరాజ్యం, కళాజీవులందరూ తత్త్వవేత్త లందరూ కలలు గంటూన్నరాజ్యం యీ హింసావిధానంతో యేర్పడిన సమాజాన్ని విచ్ఛిన్నంచేసి అహింసా సత్యాలను సుప్రతిష్ఠిత ములుగా చేయగలరాజ్యం యేర్పడవలెనంటే విప్లవంద్వారానే సాధ్యమవుతుంది. అట్టి విప్ల వం కోసమే జనసామాన్యాన్ని తయారుచేయాలి.

కానీ,

ఈ బ్రిటిషు సామ్రాజ్యతత్వం నశించే వరకూ ఏదీ సాధ్యంకాదు. కాబట్టే ప్రతివారూ పై ఆదర్శాన్ని మనసులో నుంచుకొని అందుకు సాధనప్రాయమైన సామ్రాజ్యతత్వ విచ్ఛిత్తికై స్వరాజ్యప్రాప్తికై అన్నివర్గాలవారూ కూడగట్టుకొని సంయుక్త సంఘటనద్వారా భారతదేశ దాస్యబంధనాలను విచ్ఛిన్నం చెయ్యవలెను. అంత మాత్రంతోనే తృప్తిచెందక ఆ స్వరాజ్యాన్ని నిజమైన ప్రజారాజ్యం చెయ్యడానికి విప్లవం కొని రావలెను. అందుకే ప్రతి ప్రజాతంత్రవాదీ పని చెయ్యవలెను.

విప్లవము కావాలి
విప్లవము రావాలి
విప్లవజ్వాలలతో
విశ్వమే నిండాలి

● ● ●

తరతరమ్ముల్లుగా
దాస్యదగ్ధమైన
హృదయముల రాజుకొని
పైకి రేగినట్టి
విప్లవజ్వాల లివె
వియద్వీధి కెగసె
ఆర్పలేరింక మీరెవ్వ
రార్పలేరు.

● ● ●

శ్రీ సాధన ప్రెస్, అనంతపురము.